# కొత్త గొంతుకలు : సరికొత్త విలువలు

యువభారతి రజతోత్సవ సదస్సు
ఉపన్యాస వ్యాసమంజరి

యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణ



యువ భారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

KOTTAGONTUKALU:SARIKOTTA VILUVALU
An anthology of literary essays presented at
the seminar arranged by Yuvabharathi at
its Silver jubilee celebrations 1992.

© YUVA BHARATHI

యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణ

ప్రచురణ సంఖ్య : 145

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

వెల : రూ. 20.00

ప్రతులకు :
**యువ భారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600457

ముఖచిత్ర ముద్రణ :
**విష్ణు ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,**
శంకరమఠం దగ్గర, నల్లకుంట,
హైదరాబాదు - 500 044.
ఫోన్ : 666242.

KOTTAGONTUKALU:SARIKOTTA VILUVALU
An anthology of literary essays presented at
the seminar arranged by Yuvabharathi at
its Silver jubilee celebrations 1992.

© YUVA BHARATHI

యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణ

ప్రచురణ సంఖ్య : 145

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

వెల : రూ. 20-00

ప్రతులకు :

యువ భారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600457

ముఖచిత్ర ముద్రణ :

విష్ణా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,
శంకరమఠం దగ్గర, నల్లకుంట,
హైదరాబాదు - 500 044.
ఫోన్ : 666242.



# మూడు పదుల యువభారతి

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించ గల సహృదయ లోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణలద్వారా, కార్యక్రమాల ద్వారా యువ భారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ, ప్రజా స్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీసంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ముప్ఫైయేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. సమాజంలో ఉత్తమ సాహిత్యం పుట్టటం ఒక వంతు; దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం మరొక వంతు. పొలందున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి ప్రజలు, యువతీ యువకులు, విద్యార్థినీ విద్యార్థులు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు, ఉద్యోగినులు - ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన

అంటే వారి మాతృభాషలో వెలువడిన - సాహిత్యం చదవాలి. లేదా, కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయం చేసుకోవాలి. అప్పుడే తెలుగుసాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయిత(త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సాహిత్యంలోని ఉత్తమ విలువలను గుర్తించి, గౌరవించే సహృదయ లోకాన్నీ సాహితీ వాతావరణాన్నీ సమాజంలో నిర్మించటంలో సాహితీ సాంస్కృతిక సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఆ బాధ్యతను గుర్తించి యువభారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్రను పదిలంగా వేసుకున్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమినాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకున్నది. ప్రతి నెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువభారతీయులు మూడుగంటలసేపు మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించుకునేవారు. వక్తృత్వాన్నీ, రచనా పాటవాన్నీ, ఆలోచనాశక్తినీ, అధ్యయన శీలాన్నీ, ఝుడితిస్ఫూర్తినీ అలవరచే క్లుప్త గోష్ఠి, పుస్తకచర్చ, కవితాపఠనం, సమాలోచనం మొదలైన అంశాలను చైతన్యవంతంగా నిర్వహించుకునేవారు. అప్పటి సమావేశాలన్నీ సాహితీ శిక్షణ శిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమి నాటికి యువభారతి ఒక సమగ్ర రూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్య కార్యక్రమాలను చేపట్టి ప్రజల మధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలను చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలను పొందటం ప్రారంభించింది. మహిళా విభాగ కార్యక్రమాల ప్రారంభం, సైక్లోస్టైల్డు పత్రిక వెలువరించటం (దాదాపు వెయ్యి ప్రతులు చెల్లేవి) ముఖ్యమైన అంశాలు. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేకతతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం', కాళోజీగారి 'జీవనగీత', యువభారతీయుల కవితా సంకలనం 'వీచికలు' తక్కువ ధరకు ప్రచురణ పూర్వ విరాళ పద్ధతిలో వెలువరించిన తొలి ప్రచురణలు. 1970 లో 'మారుతున్న విలువలు: రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి,

దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కీర్తిప్రతిష్ఠలతోపాటు ఒక ప్రామాణికమైన సాహిత్య సంస్థకు వచ్చే గుర్తింపును గూడా తెచ్చిపెట్టాయి

1971 - 1985 మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరంపరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచ్చిన 'కావ్యలహరి' తో మొదలయ్యాయి. 1971 లో వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపు విలువలపట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి, కవితాలహరి, చైతన్యలహరి, వికాసలహరి, రామాయణలహరి, నవోదయలహరి, నవ్యసాహితీలహరి, ప్రతిభా లహరి, ఆలోచనాలహరి, సంస్కృత సాహిత్యలహరి, జగద్గురు సాహితీలహరి మొదలైన 'లహరి' ప్రచురణలు సాహితీలోకంలో మన్ననల నందుకున్నాయి.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను పురస్కరించుకొని యువభారతి ప్రచురించిన నూరు వ్యాసాల 'మహతి' తెలుగు సాహితీ పరులలో ఒక విలువైన గౌరవాన్ని పొందింది; పరిశోధకుల మన్ననల నందుకున్నది. తెలుగు నవలలను గురించి ఇంగ్లీషులో చెప్పటానికి ప్రయత్నించిన **Telugu Novel** మంచి ప్రయోగంగా ఆదరణ పొందింది. తెలుగులో కవుల కవితా వైభవాలను ప్రచురించే యువభారతి రచనలు ప్రాచీనాధునికాంధ్ర కవులను, భారతీయ భాషా కవులను సరళంగా వ్యాఖ్యానించి చెప్పాయి; చెపుతున్నాయి. యువభారతి ప్రచురించే ప్రతి ప్రచురణా ఆయా సమయాల్లో సమాజంలో కలిగించవలసిన సాహితీ స్పృహను దృష్టిలో ఉంచుకొని రూపొందించేదే. కాలగతిలో అవిచ్ఛిన్నంగా సాగవలసిన సాహితీ రసికత్వాన్ని లహరిగా ప్రవహించేటట్లు కార్యక్రమాలను సాగించటం యువభారతి ప్రవృత్తి!

1991 - 1992 లో యువభారతి రజతోత్సవాలను జరుపుకున్నది. పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'తెలుగు కవిత : లయాత్మకత' అనే అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందించారు. అది గ్రంథరూపంగా వెలువడింది. నెలనెలా మొదటి ఆదివారం సాయంకాలం 5-30 గం॥లకు జరిగే "సమాలోచనం" సమావేశాలన్నీ రజతోత్సవాలలో భాగాలుగా మలచబడ్డాయి. 'ఈ దశాబ్దిలో తెలుగు సాహిత్యం' (1980 - 1990), 'పాతికేళ్ళ పత్రికా రచన' (1965-1990), యువభారతి రజతోత్సవ సంచిక 'వెండి వెలుగులు',

'అనుభూతి', 'అమృత రాజీవం' కవితా సంపుటాలు రజతోత్సవ ప్రచురణలుగా వచ్చాయి. రజతోత్సవాలలో భాగంగా జరిగిన సదస్సులలోని ఉపన్యాసవ్యాసాల సంకలనాలను 30 వ వార్షికోత్సవాల ప్రచురణలుగా వెలువరించటం జరుగుతున్నది. ఆలోచనలకు అక్షరాకృతి నివ్వటం యువభారతి సాహితీవ్రతం.

అత్యంత ఆధునిక సాహిత్య చైతన్యాన్ని సృష్టిస్తున్న యువ రచయితలను, రచయిత్రులనూ, వారి రచనలనూ, వాటి విలువలనూ వివేచించే సాహిత్య సదస్సును యువభారతి తన రజతోత్సవాలలో నిర్వహించింది. అందులో పాల్గొన్న సాహితీమూర్తులు అందించిన ఉపన్యాస వ్యాసాలను ఈ సంపుటిగా, 30 వ వార్షికోత్సవ ప్రచురణగా మీకు అందించ గలుగుతున్నందుకు సంతోషిస్తున్నాం.

ఈ సంపుటిలో తమ రచనలను అందించిన సాహితీ బంధువులు డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారికీ, ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికీ, ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులుగారికీ, డా॥ ముక్తేవి భారతిగారికీ, ఆచార్య పేర్వారం జగన్నాథంగారికీ, డాక్టర్ పి. సుబ్బాచారిగారికీ, డాక్టర్ మసన చెన్నప్పగారికీ కృతజ్ఞతాభివందనాలు!

యువభారతిని ప్రోత్సహిస్తున్న 'సాహితీ మిత్రు'లకు, 'భారతీమిత్రు'లకు, 'భారతీభూషణు'లకు, ప్రకటనదారులకు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, విష్లా ప్రింటర్స్‌కు మా ధన్యవాదాలు!

యువభారతిని ప్రోత్సహిస్తున్న 'సాహితీ మిత్రుల'కు, 'భారతీ మిత్రుల'కు 'భారతీ భూషణు'లకు, ప్రకటనదారులకు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, విష్లా ప్రింటర్స్‌కు మా ధన్యవాదాలు.

వార్షికోత్సవ సభలను స్పాన్సర్ చేసి, ప్రకటనల నిచ్చి యువభారతికి చేయూతనిచ్చిన చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనరు డా॥ జె. బాపురెడ్డిగారికి మా ప్రత్యేక ధన్యవాదాలు!

యువభారతి నభిమానించే సాహితీలోకానికి మా అభివందన చందనాలు!

హైదరాబాదు,
6.3.1994.

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు.

# విషయసూచిక



# ఆంధ్ర జనతకు, నవతకు
# యువతకు అంకితమ్ము

చిమ్మ చీకట్లను చీదరించుట కంటె
        చిరుదివ్వె వెలిగించు శిల్ప మెరిగి
సామాన్య జనులలో సాహిత్య చైతన్య
        సందీప్తి పోషించు సరలు తీర్చి
కమనీయ కావ్యాల కవితా కళా శిల్ప
        వైభవాల్ వివరించు ప్రభలు చిమ్మి
మానవ మూల్యాల మహనీయ సంస్కృతి
        నిర్మాణ శిక్షణ నీతి నెరపి

భారతీపాద మంజీర భవ్యరవము
తెలుగు వారల గుండెలో వెలుగునట్లు
వెలుగు యువభారతీ సంస్థ జీవితమ్ము
ఆంధ్రజనతకు నవతకు అంకితమ్ము!
ఆంధ్ర జనతకు యువతకు అంకితమ్ము!!

—డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

# సమకాలీన కవిత్వం—కొత్త గొంతుకలు

—డా॥ ముదిగొండ వీరభద్రయ్య

ఈ ఒకటిన్నర సంవత్సరాలలో (1991 నుంచి 92 మే నెల వరకు) వచ్చిన తెలుగు కవిత్వంలోని కొత్తతనాన్ని పరిశీలిస్తే రోజురోజుకీ కవితాభివ్యక్తి ఎంతగా సాంద్రమౌతున్నదీ అర్థమవుతుంది. వయస్సుకి చిన్నవాళ్ళైనా అభివ్యక్తి పటిష్ఠతను సాధించుకొంటున్న కవుల సంఖ్య పెరిగింది. మారుతున్న సమాజంలోని మారుతున్న సమస్యలను వస్తువులుగా తీసికొని తమదైన అభివ్యక్తితో చాలామంది కవులు కవితారూప తపస్సు చేస్తున్నారు.

ఈ ఒకటిన్నర సంవత్సరాలలో అనేకరకాల వస్తువులపై రాసిన కవులు కనిపిస్తున్నారు. అనేక పద్ధతుల్లో రాసినవాళ్ళూ కనిపిస్తున్నారు. ఉగ్రవాద వ్యతిరేకత (దిలావర్- 'ఆశాదీపాలు'), మతకల్లోలాలపై నిరసన (రుద్రశ్రీ, చల్లా దుర్గాప్రసాద్), గల్ఫ్‌యుద్ధం (పరమాత్మ, రావులపల్లి సునీత), పురుషులచేత స్త్రీల అణచివేత (రాఘవేంద్రరావు) మొదలైన అనేక వస్తువులను కవితలుగా అల్లారు కవులు. కొందరు కవులు గ్రామీణభాషలో కవితలు రాశారు (వేంపల్లి ఖాదర్, టి. కృష్ణమూర్తి యాదవ్). జాతీయాలతో కవితలకు అందం తెచ్చిన కవులున్నారు. పేరడీలను రాసిన వాళ్ళూ ఉన్నారు. ఐతే ఈ వ్యాసంలో కొత్త గొంతుల పేర్లూ, వస్తువులూ చెప్పడం నా లక్ష్యం కాదు. ఈ కవులు కవితా విద్య నెంత సాధించారో ఎత్తిచూపడం నా ప్రధాన లక్ష్యం. [అంటే కవితా విలువలను వీళ్ళెట్లా కాపాడి, ప్రతిష్ఠాపిస్తున్నది తెల్పడం అన్నమాట.]

మునుపటి కాలంలో కన్నా ఇవేళ కవుల సంఖ్య గణనీయంగా పెరిగింది. మంచి కవులు కూడా చాలామందే ఉన్నారు. ఈ పద్దెన్మిది నెలల్లో 20 కి మించి

కవితా సంకలనాలు వచ్చాయంటే కొత్త గొంతులు పాత గొంతులకు తోడుగా ఎంత కృషి చేస్తున్నది స్పష్టపడ్తుంది.1

శ్రీ ఎండ్లూరి సుధాకర్ గోదావరి వస్తువుగా రాసిన కవితలోని కింది పాదాల్ని చూడండి.

''ఆకాశం చిలక్కొయ్యకు/జిలుగు దుస్తుల్ని వేలాడదీసి
తారలు రహస్యంగా గోదాట్లో స్నానమాడిపోతాయి.
గోదావరి నీటివొంపుపై పడవలు కదిలే పుట్టుమచ్చలవుతాయి.
వర్షాకాలం కొత్త గోదావరి చిక్కని ఇరానీ టీలా ప్రవహిస్తుంది.
ఏ కాలంలోనైనా గోదావరి నీటిగుండె పైకి స్పష్టంగా కనబడుతుంది.''

గోదావరీ మాతకున్న 'తడిగుండె'ను 'నీటిగుండె' పదబంధంతో సూచిస్తున్నాడు కవి. మొదటి రెండు పాదాలు ఉత్ప్రేక్షిస్తున్నాడు. మూడు నాలుగు పాదాల్లో చాలా వాస్తవమైన ఉపమాన రచన, కదిలే పుట్టుమచ్చలుగా పడవలను దర్శించగల్గడం కవియొక్క ప్రతిభను తెల్పుతున్నది.

పి. రామ్‌నారాయణ్ సృష్టించిన కింది అలంకృత పాదాలను చూస్తే కొత్త గొంతులు ఎంత అకర్షకాలో తెలుస్తుంది.

---

1. విరిమువ్వలు - ఎం. పురుషోత్తమాచార్య 2. నేత్రోదయం - మసన చెన్నప్ప 3. రాళ్ళుముళ్ళు - కనపర్తి రామచంద్రాచార్యులు 4. ఇదదే జీవితం - డి.యం. రవిప్రసాద్ 5. నేపథ్యం - అశారాజు 6. బహుముఖం - యార్లగడ్డ రాఘవేంద్రరావు 7. నాలుగు శతాబ్దాల సాక్షిగా నా మహా నగరం - నిఖిలేశ్వర్ 8. తొక్కుడు బండ - కృష్ణమూర్తి యాదవ్ 9. సఖ్యతా కిరణాలు - (సం) జి. శ్రీశైలం 10. అశాంతి ఆర్కెస్ట్రా - మాదిరాజు రంగారావు 11. అవిశ్రాంతం - సి. వి. కృష్ణారావు 12. రహస్తంత్రి - వేగుంట 13. అశ్రువీధిలో అగ్నినాదం - అడిగోపుల వెంకటరత్నం 14. ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది - జయప్రభ 15. అభిజ్ఞ I&II కవితా బులెటిన్లు - (సం) సుమనశ్రీ 16. సంతకాలు - తెనాలి పొయెట్రీ ఫోరం నిర్వహణ - ఇంకా అనేకం. 17. యుద్ధమంటే మాకు భయంలేదు - అడిగోపుల వెంకటరత్నం.

''రెక్కలు తడిసిన పక్షులు ఈత్తూ రావడానికి
దిక్కులు కలుపుతూ హరివిల్లు ఫ్లయోవర్‌లా వేస్తుంది.'' (చిరాపుంజి

ఇంతకన్నా ప్రౌఢంగా పెన్నా శివరామకృష్ణగారి అభివ్యక్తి సౌంద ర్యాన్ని కింది పాదాలలో చూడగల్గుతాము.

''నీ గుండె ప్రమిదలో తలను దీపంగా వెలిగించుకుంటూ
కృష్ణరజనీగంధంగా మిగిలిపోతా'' (ఒక్క సంధ్యకోసం)

విలువలు మారిన మన సమాజంలో పండుగనాటి ప్రాచీన సంప్ర దాయాలు పేరుకి మాత్రమే మిగిలి ఎలా యాంత్రికమూ, నిస్సారమూ అయి పోయినవో తెల్పుతున్న వ్యాజంతో బ్రతుకు కష్టాన్ని వ్యంగ్యంగా అభివ్యక్తీక రించిన కె. గీత రాసిన కింది పాదాలను చూడండి:

''హరినామస్మరణలో బ్రహ్మాండాన్ని చుట్టేసే హరిదాసు
కాళ్ళలోకి సూదంటురాళ్ళు గునపాల్లా గుచ్చుకుంటున్నా
గుంజీలు తీస్తూనే వుంటాడు.
కాగిపోయే ఎండలో కాలేకాళ్ళతో
కష్టాన్ని కూటికోసం కోటిరాగాలుగా పలుస్తాడు గంగిరెద్దువాడు.
శంఖారావంలోనే శక్తి ఉడిగిపోయిన ముసలిజంగం
ఇంకా జబర్దస్తీగా జీవితాన్నదుక్కుంటూ ఒంటాడు." (పండుగొచ్చినపుడు)

చుట్టడం, గుంజీలు తీయడం, రాగాలు వాయించడం, అడుక్కోవడం అన్నవి ఇంకా మిగిలి ఉన్నప్పటికీ వాటికి చేసిన కవితావ్యాఖ్యానం ఎంతో ఆకర్షకంగా ఉంది. విరి మువ్వలులోని 'క్రాంతి పుడమి' కవితలో ఎం. పురుషోత్తమాచార్య ఇదే పనిని చేశారు.

సూర్యాస్తమయానంతరం దీపాలు వెలిగించడాన్ని కవిత్వీకరిస్తూ పసునూరి శ్రీధరబాబు తన 'వెన్నెల రాత్రులు' కవితలో ఇలా రాశారు:

"ఇంకిపోయిన సూర్యాస్తమయాన్ని....
ఏకాన్తో దాచిపెట్టిన గుడ్డిదీపాలు ఇళ్ళల్లో
బిమ్మిలమధ్య బంధించబడ్డ సూర్యునిపిల్లలయ్యేవి!"

ఇంకా ఈ కవి ''సుమ్మాల్లో సత్తుపళ్ళెల్లో మనుషులంతా వెన్నెలను భోంచేసేవారు' అని అంటాడు. కవుల భావనాశక్తి మనకు ప్రత్యక్షమయ్యేది ఉత్ప్రేక్షించడంలో. ఈ కవిలో ఆశక్తి ఉన్నది. సాయంత్రం పూట పేదలు శ్రమ చేసి చేసి ఇంటికి తిరిగి వస్తున్నారనడానికి "జీవితాల్ని మోస్తున్న శీతాకాల సంధ్యా పుష్పాలై 'వాళ్ళంతా'!" అని అంటారీయన. శ్రామికుల్ని సంధ్యా పుష్పాలుగా రూపించడం ఎంతో నవ్య అభివ్యక్తి. సంధ్యా పావిత్ర్యం, అర్చనా సూచన ఇందులోని లక్షణాంశాలు. 'మోస్తున్న' అని అనడంలో వారు శ్రామికులనీ, వారి జీవితం సుఖప్రదంగా లేదనీ వ్యంగ్యార్థం.

అఫ్సర్‌లాగా పాఠకులను తేలికగా తానుద్దేశించిన మూడ్‌లోకి తీసుకొని వెళ్ళగలిగే అభివ్యక్తీకరణ ఆశారాజుది.

"నరికేసిన శిరస్సులా చంద్రుడు వెన్నెల్ని కారుస్తాడు"
"మేఘాలు దుఃఖించి వెన్నెల్ని ఆర్పేస్తాయి"

ఆకాశమనే రుద్రభూమిలో తిరుగాడే కొరవి దయ్యం, ఆకాశపు టెడారిలో కాళ్లు తెగిన ఒంటరి ఒంటె నుంచి చంద్రోపమను ఆశారాజు ఎక్కడికి చేర్చాడో చూడండి! ("ఫుట్‌పాత్ మీద నడుస్తున్న ఆడపిల్ల/చీకట్లను నములుతూ దీపమై వెలుగుతుంది" (నేపథ్యం - పు. 28) అని అన్న ఆశారాజు ప్రతిభ చాలా గొప్పది) ఇట్లాగే చందమామ వెన్నెలను కవిత్వీకరించిన మరో మంచికవి ఖాజా మొహియుద్దీన్ (నీచోపమే అయినా నవ్యాభివ్యక్తి ఇది)

"సున్నం కుప్పలో పొర్లి/నల్ల కుక్కలా నడిచి వస్తుంది వెన్నెల"
('తప్పదిక' - పుట్టుమచ్చ)

ఇలాంటి నవ్యాభివ్యక్తీకరణే చేసిన ఇంకో కవి కనపర్తి రామచంద్రాచార్యులు.

"అటుకుమీది/అమృత భాండం పగిలి/దిక్కుల పంటకారి/
నేలంతా తడిసినట్లు వెన్నెల" ('నగరంలో వెన్నెల' - 'రాళ్లుముళ్లు'లో)

ఇవేళ భూగోళం మొత్తం వ్యాపించి ఉన్న హింసావాదాన్ని నిరసిస్తూ కావచ్చును - దోర్బల బాలశేఖరశర్మ 'గురి చూపును ఉరి తీసే క్షణం' అన్న కవితలో-

"భూమికి ఆకాశానికి మధ్యన వెలుగు కాలుతున్న వాసన
మట్టినిండా మాంసంతో ఏపుగా పెరిగిన కలుపు మొక్కలు
పిడికిట్లో పిసికేస్తున్న భూగోళం పండులోంచి కారుతున్న నెత్తురుధార
కాలం కన్న ప్లాస్టిక్ పువ్వు ఇరవయ్యో శతాబ్దం"

అని అంటారు. వాసనలేని అసహజమైన పువ్వులాంటి అమానుష అసహజకాలం అని కవి హృదయాన్ని చివరిపాదం తెలుపుతుండగా, వెలుగు కాలుతున్న వాసన, మాంసంతో ఏపుగా పెరగడం, భూగోళం పండు, అందులోంచి కారుతున్న నెత్తురుధార—అన్నవి ఈ కవియొక్క అభివ్యక్తి విలక్షణత్వాన్ని తెలిపే ప్రయోగాలు. వెలుగు కాలుతున్న వాసన అనడం ధ్వనిగర్భితం కూడా.

కొందరు కవులది సరళాభివ్యక్తి. "నీ పాట గాలిలో తేలివచ్చి నన్ను తాకుతోంది." [పరిమళ నిగళం] లాంటి పాదాలలోనిది సరళాభివ్యక్తి. ఇవి సుందరంగానే ఉన్నా, సంశ్లిష్టాభివ్యక్తుల ఆకర్షక శక్తి ఇంకా ఎక్కువ. సిద్ధార్థగారి ఏకాంత దీపసన్నిధి కవితలోని కింది పాదాలు ఇలాంటి అభివ్యక్తితో ఉన్నవి.

"కొండల నుదురుపైకి మగతలాగా
కమ్ముకొనే సాయంకాలపు అనుభవంలోకి
పాటలమై వలయాలు పోతాం"

సాయంకాలం కొండలపై ఎలా ఉంటుంది? అది కలిగించే అనుభవంలో ఆనందం ఎలాంటిది?. ఈ రెంటినీ సంశ్లిష్టరీతిలో జోడించి కవిత్వీకరిస్తున్నాడు సిద్ధార్థ. కొండ చివర్లను నుదురనడం, సాయంసంధ్య కమ్ముకోవడం మగత లాగా ఉన్నదనడం - దీన్నంతా అనుభవించటానికి పాటలు అయి, అందులో గింగుర్లు తిరగడం - అన్న అభివ్యక్తులన్నీ దీన్ని కవిత్వీకరిస్తున్నాయి. ఇదే కవితలో ఈయన అమూర్తవిషయాన్ని మూర్తవిషయంతో ఉపమిస్తూ-

"కదలని చెట్ల ఆకులపై/నిశ్శబ్దాలను తైలంలా పూసికొని రోదిస్తాం" అని అంటాడు. చీకటి డైరీలన్న కవితలో (అభిజ్ఞ-1).

"నెత్తుర్లో ముంచి తీసిన పాలపిట్ట శవంలా ఉంటుంది/నా ప్రశాంతత ఎప్పుడూ"అని అంటాడు. పఠితకు భావానుభూతి గాఢంగా కల్గడానికి ఇలాంటి

సంశ్లిష్టాభివ్యక్తులు ఎంతో తోడ్పడ్డాయి. ఖాదర్ మొహియుద్దీన్ రాసిన మరొక సంశ్లిష్టాభివ్యక్తిని చూడండి:

"పాములా పాక్కుంటూ వచ్చి / ప్రశ్నార్థకంలా పడగ విప్పింది ఏకాంతం" [పెదాలచితి - పుట్టుమచ్చలో.]

ఇలాంటి అభివ్యక్తిచేత భావచిత్రం పఠితకు స్పష్టంగా కళాత్మకంగా అందుతుంది. అట్లా అందడంతోపాటుగా అతనికి సౌందర్యానుభూతిని గాఢంగా కలిగిస్తుంది. అభివ్యక్తి సంశ్లిష్టంగా ఉన్నప్పుడే సౌందర్యానుభూతిలో గాఢత ఉంటుంది. ప్రాచీన కవిత్వంలోనూ సంశ్లిష్టాభివ్యక్తినే ఎక్కువగా గౌరవించారు. ఆనాడు దీనికి ప్రత్యామ్నాయంగా సంసృష్టి, సంకర అలంకారాలను (రెండింటి మధ్యన కొద్ది భేదం ఉన్నది) వాడారు. కొన్ని అలంకారాలు ఒక గుచ్ఛంలో కలిసివుండి, అందులో ఒకటి ప్రధానము, తక్కినవి దానికి అంగాలైతే సంసృష్టి[1] (అట్లాకాక గుచ్ఛంలోని అలంకారాలన్నింటికీ సమప్రాధాన్యం ఉంటే సంసృష్టి అని కొందరు), గుణప్రధాన భావముంటే సంకరమనీ అన్నారు. ఈ లక్షణం ఇట్లాగే పూర్తిగా అన్వయం కాదుకాని, అనేకాలంకారాలకు సమప్రాధాన్యం ఉండడమో, [పైన ఉదహరించిన సుధాకర్‌గారి గోదావరి వర్ణన చూడండి] లేక ఒకే అలంకారాభివ్యక్తిలో ఒక మూడ్‌ని గాఢంగా పఠిత హృదయంలో కలిగేట్లుగా రచించడమో ప్రౌఢ రచన చేసే వాళ్ళల్లో కన్పిస్తోంది. ఉదాహరణకు 'ఎవరు పూరిస్తారు'లో [ప్రవహించే జ్ఞాపకం], యాకుబ్ రాసిన ఈ పాదాలను చూడండి:

"చందమామ కూడా గాయపడింది
భూమ్మీద తెల్లటి రక్తాన్ని రాత్రంతా ఒంపుతుంగి."

వెన్నెలను గుణసామ్యం లేకున్నా, రక్తంగా దర్శిస్తూ దానికి హేతువుగా చందమామ గాయపడడం సంభావిస్తాడు. ఒకే అలంకారాభివ్యక్తి అయినా, ఒక గాఢమైన మూడ్‌ని కవి ఇందులో నిక్షేపించాడు. కావ్యలింగం ఆత్మ ఇందులో ఉన్నది. రెండవ పాదానికి మొదటి పాదం హేతువు కావడంతో ఆగిపోకుండా,

---

1. 'నానాలంకార సంసృష్టిః సంసృష్టిస్తు నిగద్యతే' అని దండ్యాచార్యుని నిర్వచనం.

వర్తమానకాలపు లోటుని ఎత్తిచూపుతూ, ఇప్పుడు స్థిరపడిన వెలితిని అనుభవించడానికి ఇల్లాంటి సంశ్లిష్టాభివ్యక్తి ఎంతగానో తోడ్పడుతుంది.

రూపకమూ, ఉత్ప్రేక్షా కలిపిచేసిన 'ఉల్చి' గారి 'ప్రవ్వకాల్లో భూగోళం' అన్న కవితలోని అభివ్యక్తీకరణ ఎంత ప్రౌఢంగా ఉందో చూడండి:

"చిల్లుల మబ్బుల జల్లెడలోంచి
సూర్యరశ్మి పుప్పొడిగా భూమి బుగ్గలమీద రాలింది.
సూర్యరశ్మి భూమిని వివస్త్రను చేసి నగ్నసౌందర్యాన్ని చూస్తున్నట్లుంది."

యార్లగడ్డ రాఘవేంద్రరావు గారి "రేపటికి ముందు...." అన్న కవితలో ఇట్లాంటిదే మరొక ప్రౌఢాభివ్యక్తి కనిపిస్తుంది.

"ఆకుల మీదనుండి సుతారంగా నడచివెళ్ళే చిరుగాలి కెరటం సడిలేకుండా తొంగిచూస్తుంది.

రాలిన పూలు కాళ్ళు చేతులు ధరించి కథలు చెబుతాయి...."

దేవులపల్లి రాసిన 'సడిచేయబోకే ఓ గాలీ' అన్న పాట జ్ఞప్తికి వస్తుందీ పాదాలు చదువుతుంటే. లబ్ధప్రతిష్ఠురాలైన కొండేపూడి నిర్మల ఇలాంటి సంశ్లిష్టాభివ్యక్తీకరణ శక్తిచేతనే తన కవితలకు గౌరవాన్ని పొందగల్గుతున్నది. ఇలాంటి అభివ్యక్తి కింది పాదాలు మంచి ఉదాహరణ:

"చివరికి పెన్ను పట్టుకున్న / చూపుడు వేలూ బొటనవేలూ కలిస్తే
పుల్లను నోటకరుచుకుని పడిపోయిన చెట్టు ఆనవాలు
వెతుకుతున్న / పక్షి ముక్కులా వుంటుంది.''

('ఎదురు చూపు' - నడిచే గాయాలు)

సరళాభివ్యక్తి చేస్తున్న వారి రచనలు ఒకరకం. అవీ ఆకర్షిస్తూనే ఉన్నాయి. టి. పతంజలిశాస్త్రి 'ఈ నదిని ప్రేమించాను' కవితలో సూర్యకిరణాలు పడిన నదిని వర్ణిస్తూ-

"ఒక్కో సాయంత్రం నువ్వు/ సూర్యుడిమీంచి జారిన/ కాషాయ కండువాలా ఉంటావు'' అని అంటాడు. 'బిందు దర్శనం' అన్న కవితలో అద్దేపల్లి? గోపుల వెంకటరత్నం గారు రాసిన

"నువ్వు నాలోకి తొంగిచూడు,
తలకు ఎన్ని వెంట్రుకలున్నాయో అన్ని
వికృతరూపాలు కన్పిస్తాయి."

అన్న పాదాలు కూడా సరళాభివ్యక్తులే. పైన నిర్మలగారి రచనలోని అభివ్యక్తిని చూస్తే రెండు పరస్పర విరుద్ధ వస్తువుల మధ్యన సాదృశ్యాన్ని చూడగల్గడమే కాక ఆ పక్షి ముక్కు యొక్క ఆశయం, అందోళనలన్న అనుభూతిని అది ఇముడ్చుకోవడంతో సంశ్లిష్టాభివ్యక్తి అవుతున్నది. (కాస్త దూరాన్వయం అనుకోకపోతే) కలం పట్టి రాస్తున్న కవి మనస్సు కూడా అలాగే (ఆ పక్షి ముక్కులా) ఉండాలి. సాధారణంగా ఉత్ప్రేక్షలను పేనుతున్నప్పుడో కవిత్వపరమైన హేతువులను ప్రాకృతిక సంఘటనలకు చూపించినప్పుడో అభివ్యక్తిలో సంశ్లిష్టత ఏర్పడి బాగా ఆకర్షిస్తుంది.

భోగవల్లి గాయత్రి రాసిన 'ఈ రాగం పేరేమిటి?'లో ఈ లక్షణం బాగా కన్పిస్తుంది. సూర్యాస్తమయ, చంద్రోదయాలనీ కొత్త గొంతుక ఎలా ధ్వనించిందో చూడండి.

"మందార చెట్టు వెనక మబ్బుల్లో/ధగ ధగలాడుతున్న సూర్యుని రక్తిమ
మందారాల ముద్దుల్లోకి కరిగిపోయి/నేలలోకి జారిపోతున్నందుకేనేమో
పెరట్లో మట్టి అంత ఎర్రగా ఉంది./మరి/ఆవేశమంతా అలా కరిగిపోగా
పారదర్శకంగా మారిన సూర్యుడు/ధ్యానంలోకి మునిగిపోయి
మంచుముక్కగా మేలుకొంటే/ఆ మంచు ముక్కనుండి వస్తూన్న
చల్లని తెల్లని పొగలకేనేమో/తోటలో లేతపసరువన్నె మొగ్గలన్నీ
మంచుపూత పూసుకొని/తెల్లగా విచ్చుకున్నాయి."

సంసార తాపం వీడి ఒక మహాయోగి చల్లని తెల్లని వెన్నెల సదృశంగా స్థితప్రజ్ఞుడవడం ఇందులో ధ్వనిస్తున్నది అలంకారాభివ్యక్తిద్వారా.

కొందరు సూక్తులూ, తాత్త్విక సత్యాలూ చెప్తున్న ధోరణిలో కవితలు రాశారు. ఐతే, అందులోని అలంకృత రచన వాటిని అభివ్యక్తిసుందరం చేశాయి. గడియారం శేషఫణిశర్మగారి 'అక్షరాలు' అన్న కవితలోని-

"అక్షరాలు వ్యాపిస్తే/దేశభాషలౌతాయి/అవే లోపిస్తే
ఆరణ్యక వేదఘోషలౌతాయి/

అక్షరాలు /నేలకు దిగజారితే మాటలౌతాయి
అవే నింగికి కొనసాగితే/నడిచే పూలతోటలౌతాయి."

పాదాలు ఇలాంటివి ఇలాంటి అభివ్యక్తినే మిదియాల లక్ష్మీపతిగారి వెలుగు పులుగులో చూస్తాము.

"లోకంల్లో సూర్యోదయం అయినవాడు /సమాజంలో వేకువ వెదచల్లుతాడు
సరాల్లో మహానదులు ఉన్నవాడు / మేధల్లో ఉదయాలు పుష్పించుకొనేవాడు
సముద్రాల్ని ఆకాశంలో వ్రేలాడదీస్తాడు / మేఘాల్ని పరమహంసలుగా
మారుస్తాడు"

పాపినేని శివశంకర్ రాసిన హంస గీతంలో ఈ క్రింది తాత్త్విక సత్యాలను గమనించండి:

"మృత్యువును ద్వేషించకుండా జీవితాన్నెలా జీవిస్తావు
ఎన్నడైనా దేనిముందైనా మనిషి ఓడిపోవడం సహించలేను
నువ్వు మరణించినా సహిస్తాను
మరణాన్ని కీర్తిస్తే సహించలేను
మృత్యుధిక్కారమే జీవితం- సమరసంగీతమే కవిత్వం."

చివరిపాదం ఉన్నట్లు తక్కిన పాదాలుంటే బాగుండేది. జ్వాలాసాగర్ రాసిన 'ఖా....ళీ' కవితలోనూ ఇంతే, ఐతే ఈ కవితలోని-

"చచ్చుపడిన ఆత్మను మోసే
చక్రాలబండిలాంటి శరీరపు
లక్ష్యంలేని కదలికల్ని భరించడం కష్టమౌతుంది"

అన్నది మంచి అభివ్యక్తి. తాత్త్వికతా, కవిత్వాభివ్యక్తీ- రెండూ సమంగా దించగల్గిన కవితకు ఆకర్షణ చాలా ఉంటుంది. యార్లగడ్డ రామవేంద్రరావుగారి కింది పాదా లిలాంటివి:

"జీవితమంటే అనల రుతువు కాదు; ఒక కాంతిపతాకం
జీవితమంటే విస్మృతపురాస్వప్నం కాదు, వసంతాల్ని పూసే శిశిరం
జీవితం / మట్టిపుటలమీద మబ్బులు రాసిన కవిత్వం
కావాలంటే ముందు చినుకు పూల పుప్పొడి కావాలి
జీవితమంటే సిద్ధాంతాలసంతకాదు; వైవిధ్యాల కూడలి"

('ఫలించీ ఫలించని స్వప్నం' - బహుముఖం)

కవిత్వంలో ఏ భావాన్నీ, ఏ అనుభూతినీ చిత్రించినా అది-

''ముడుచుకున్న రెక్కల చప్పుడు శబ్దంగా పగిలి
ఒదిగివున్న రేకుల మెత్తన రంగులుగా పరిసి
కవిత్వంగా రగిలి / అక్షరాల్లో పగిలి
ఒక కొత్త పునరావాస కేంద్రంలో
తలదాచుకోవాలనే కవిత్వ కాంక్ష''

('కవిత్వంగా రగిలి' - ఆర్వీయస్ సుందరం & ఎండ్లూరి సుధాకర్)
అన్నట్లుగా ఉండాలి. లేదా శివారెడ్డి గారన్నట్లు
''మానవపద్యనిర్మాణంలో ఉన్నవాడికి నిదరలేదు, విశ్రాంతి సుఖంలేదు
ఒక అవిరళ ఆరాట భరిత హృదయం తప్ప, ఒక అవిచ్ఛిన్న యుద్ధ
జ్వర పీడనం తప్ప''

లాగానైనా ఉండాలి, లేదా ఖాజామొహియుద్దీన్ రాసినట్లు-

"నా పాట/పేర్చిన నా పెదాలచితిమీంచి
పచ్చటి మంటలా వెలుగుతుంది." ['పెదాలచితి' - పుట్టుమచ్చ]

అన్నట్లుగానైనా ఉండాలి. చెప్పకుండా ఉండలేని స్థితి వచ్చినప్పుడు వస్తువు కలిగించే ప్రేరణ విలక్షణంగా నవ్యరూపంలోకి అభివ్యక్తీకరింపబడడమే మంచి కవులందరి అనుభవం. అసలు కవిత్వం అభివ్యక్తి కళ. సూర్యచంద్రరావుగారు 'వలయంలో చిక్కుకున్నాక' అనే కవితలో ఇదే విషయాన్ని కవిత్వీకరించారు.

"కవిత్వంలాంటి నీరెండ/పరిసరాలపై ప్రవహించిన వేళలో
ఆకాశాన్ని స్పర్శించాలన్న వెర్రి ఆవేశంతో
చెరువులోని చేప ఎగిరెగిరిపడుతుంది.
అదే అదునుగా నీటిబొట్లు కొన్ని
తామరాకు గద్దెనెక్కి స్వాతంత్ర్యాన్ని పొంది
విజయగర్వంతో మెరిసిపోతాయి.
............
అంతా అందమైన ఒక పువ్వుగా మారిపోతుంది.
మనిషిని నేను - ఆ వలయంలో చిక్కుకుని
ఊరికే ఎలా ఉండగలను?"

ఈ ఒకటిన్నర సంవత్సరాల కవితల్లో భావచిత్రాత్మక కవితలు తక్కువే వచ్చాయి. మొత్తం కవిత భావచిత్రాత్మకం అయిన కవితలు మంచివి నాలుగైదు మాత్రమే లభించాయి. తక్కినవాటిని కవులు సరిగ్గా వాడలేదు. ఎం. పురుషోత్తమాచార్య రాసిన క్రాంతిపుడమి (విరిమువ్వలులో), కనపర్తి రామచంద్రాచార్యుల 'వానచినుకు', నాశేశ్వరం శంకరం రాసిన 'చెరువుబతుకు' అన్నవి భావచిత్రాత్మకంగా వచ్చిన కవితల్లో మేలైనవి.

కవిత యొక్క సాఫల్యం అది కవిత్వం కావడం మీదనే ఆధారపడ్తుంది. అలంకార, భావచిత్రం, ప్రతీక, వక్రోక్తి, ధ్వన్యాత్మకత మొ॥నవి లేకుండా రాసినవి కవిత్వంగా చెలామణి కాలేవు. కె. రామమోహనశర్మ పుస్తకం అన్న వస్తువుమీద 'పుస్తకాన్ని చదివేముందు'అన్న కవిత కవిత్వపఠనా ప్రయోజనాన్ని కూడా తెల్పుతుంది.

"పుస్తకం చదివిం తర్వాత
ఒక పురుడు పోసుకున్న పాపై కళ్ళు తెరవాలి.
కంట తడిపెట్టుకున్న నడుస్తున్న జీవితం!
చలిస్తున్న మనిషి /సంచలిస్తున్న ఆవేశరూపము"

ఇటీవలి కవితల్లో ఆవేశమున్నంతగా కవిత్వాభివ్యక్తి కూడా ఇంచుమించు సమంగా ఉండడం విశేషం.

ఇక ఈ కాలపు కవుల వస్తుదృష్టిని పరిశీలిస్తే ఎంతో వైవిధ్యం కన్పిస్తున్నది.గత దశాబ్దపు ఫ్యాషన్లను కొందరు కవులు ధైర్యంగా పోగొట్టారు.

స్త్రీ వ్యక్తిత్వంమీద దృష్టిని నిల్పుతూ యం. అనూరాధ రాసిన కన్నీళ్ళలో నుండి అన్న కవితలోని కింది పాదాలను చూడండి:

"భర్త రసాకాంక్షతో మరెవతనో కట్టుకుంటానని నాతోనే తెగేసి
చెప్పిన ముసురుపట్టినరాత్రి
వణుకుతున్న ఎర్రనిదీపపుమంటగా అర్థమైంది.
స్త్రీవైన నీవు శరీరంతో జీవించు కాని
హృదయం నీకెందుకు - అంటున్నారు.
కూరగాయలు కోసేదే ఐనా - నా దగ్గరా ఓ కత్తి ఉంది కదా!"

ఇదే దృష్టితో కె. రామమోహనశర్మ 'అమ్మ' (నెలనెలా వెన్నెల - 2) కవితనూ, యార్లగడ్డ రాఘవేంద్రరావు నరనారీయం (బహుముఖం) రాశారు.

మార్క్సిజంను నిరసిస్తూ మంచి కవిత్వం రాస్తున్న కొత్త తరం ఒకటి ఇవేళ సాహిత్య క్షేత్రంలో నిలదొక్కుకుంటుంది. బుర్రా సుబ్రహ్మణ్యం గారి 'రంగునుంచి రంగులోకి' ఇందుకు మంచి ఉదాహరణ.

"ఎవరైనా స్త్రీ కనిపిస్తే నుదుటిమీదే చూపు కేంద్రీకృతం
కుంకుమో, క్రోధమో అగుపిస్తేనే ఆమె వాడికి ఆప్తురాలు.
లేకుంటే ఆమె ఆడది కాదు కదా కనీసం మనిషైనాకాదు."

ప్రపంచంలో కమ్యూనిస్ట్ రాజ్యాల దుర్గతిని చిత్రిస్తూ బి. శర్మగారు 'డామిట్' అన్న కవితలో ఇలా రాశారు—

"అడుగు ముందుకు వేశారో ఖబడ్దార్!
అని అదిలించే అన్నగా రక్తమించారు
నూరేళ్ళు నిండకుండానే/నూరేళ్ళు నిండిపోయాయి.
రొమ్ములు విరుచుకు ఎదిగిన మూకనిజము కనుమూసింది."

ఇట్లాగే శ్రీరంగం రామానుజాచార్యులు 'గతితార్కిక భౌతికవాదం' అన్న కవిత రాశారు-

"అతివాదపుటావేశంలో/భ్రుతిమించిన అజ్ఞానంతో
మతిమాలిన మనుషుల వేదం/గతితార్కిక భౌతికవాదం
నరజాతికి చరమోపాయం/సమర సమయ సౌహృదవాదం."

సుందరాభివ్యక్తులు లేని రచన ఇది. కేవలం ఆలోచన సత్యమైనంత మాత్రంలో లాభంలేదు, ఆంధ్రప్రభ వారపత్రిక నిర్వహించిన వచన కవితల పోటీలో ద్వితీయ బహుమతి సాధించుకున్న ఆదూరి సత్యవతీదేవి 'కానుక' అన్న కవితలో ఇలాంటి కవితల్ని రాసేవాళ్ళు గమనించాల్సిన అభివ్యక్తి పద్ధతి దొరుకుతుంది.

"పులుల కాహారమై పోతున్న లేళ్ళనీ, లేళ్ళని మేస్తున్న పులుల్నీ
ఒద్దికగా ఒక బాటపై నడిపించే మహర్షుల మవుదాం
ముద్దుగా ఈ ధరిత్రికొక శాంతిగీతం బహూకరిద్దాం!"

పి. చంద్రశేఖర్ ఆజీబ్ అన్నకవి మార్క్సిజంపై నిరసనను అధిక్షేపాత్మకంగా 'క్షమించు మహాకవీ!' అని శ్రీశ్రీని తలపిస్తూ రాసిన కవిత ఉత్తమ స్థాయిది.

"మేమింకా తూరుపు కోసం చూస్తుండగానే
మా వెనకాల అస్తమయం జరిగిపోయింది.
ఈనాటి స్థితిలో ప్రభవించేది
కవిత్వమైనా కొత్త సృష్టిదయినా పాలపొంగే
క్షమించు మహాకవీ....
కవిత్వం మాకిపుడు ఆయుధం కాదు
జమ్మిచెట్టు మీదున్న శవాకారం!"

సినారె రాసిన 'నెత్తుటి కేక'కు ఇది కొత్త గొంతు. ఇవేళ హింసను ఎగవేసే బాధ్యతారహితులైన కవులు తగ్గుతున్నారు.

ఈ ఒకటిన్నర సంవత్సరాలలో ప్యారడీలు కూడా వచ్చాయి. శ్రీశ్రీ కవితకు ప్యారడీ చేస్తూ రామతీర్థగారి 'లేవు తల్లీ!' అన్న కవిత వచ్చింది.

"బోల్షివిక్ కులంబు లెచ్చట?
క్రామేడ్ మందార ఛాయ లెచ్చట?
లేవు తల్లీ! నిరుడు/విరిసిన సుమ సమూహములు.
....
ఎక్కడమ్మా 'అరోరా' పెదబొబ్బల తూర్పుమంకెనలు
మార్క్స్ లెనిన్‌ల చింతనామృత/పారిజాతము లేవి తల్లీ?
....
ఎరుపు రెక్కలు విసిరి కాలం
మరుపు దారుల జారిన జాడలేవీ?
లేవు తల్లీ నిరుడు/విరిసిన సుమ సమూహములు."

మతాన్ని తిట్టడం చాలాకాలం ఫ్యాషన్‌గా ఉండేది. దానిమీద వాస్తవ దృష్టిని చూపిన కవులు తక్కువే. ఐతే, కె. రామమోహనశర్మ గారు మతాన్ని న్యాయదృష్టితో చూస్తూ ఇలా రాశారు:

''ఇసుక రేణువులు నదుల తిన్నెలై సేదతీర్చే
ప్రయత్నమే మతం/ఒక్కడిని సమూహంగా మార్చే
శక్తిరూపమే మతం/....మతమెప్పుడు సంఘర్షించదు.
మౌఢ్యం తప్ప/మతమెన్నడు కత్తులు విసరదు/స్వార్థం తప్ప"

పాశ్చాత్యుల ననుకరిస్తూ తెలుగు సంఘంలోకి తెస్తున్న 'కొత్త' ఆచారాలను ఖండిస్తూ కనపర్తి రామచంద్రాచార్యులు-

''పుట్టిన రోజు పేరుతో/ముట్టించిన దీపాలను ఆర్పకు
'వడమటి ఆచారాన్ని'/పట్టుబట్టి నేర్పకు
అవి 'కొవ్వు' దీపాలు/మనవి 'స్నేహ' దీపాలు."

కొవ్వు, స్నేహ శబ్దాలపై కవే ప్రత్యేకదృష్టిని వేయిస్తున్నాడు.
ఇల్లునాది/పొలంనాది/ఈ పిల్లలు నావాళ్ళంటే
ఇది నిన్నటిమాట/దేశం నాది/జాతి నాది
ఈ ప్రజలు నావాళ్ళంటే/ఇది నేటిమాట-(నేత్రోదయంలో మసనచెన్నప్ప) లాంటి అలతి అలతి మాటల్తో గొప్ప సమస్యలను చెప్తున్న కవితలు వస్తున్నాయి. పొడిపొడి మాటల కవితా రచనలు తగ్గుతున్నాయి. కొన్ని ఫ్యాషన్లని వస్తువు విషయంలో కవులు పోగొడ్తున్నారు. "ప్రపంచానికి పత్రహరితాన్ని పంచిపెట్టే వరరేకులు - రోడ్ల పక్కన టెలిఫోను స్తంభాలపై ఉరేసుకుంటు న్నాయి,'' (ఒబ్బిని) వంటి సుందరాభివ్యక్తులు నేటి రచనల్లో కొల్లలుగా కన్పిస్తున్నాయి. అయితే కవితను మొత్తాన్ని పరిశీలనకు తీసికొన్నప్పుడు కవిత్వం యొక్క అసలు గొప్పతనం తెలుతుంది. ఈ వ్యాసంలో ఆ పని చేయలేదు. అలాంటి పరీక్షకు కూడా విలువగలిగే కవితలు అనేకం వచ్చాయి. ఒక కేంద్ర సాహిత్య ఎకాడెమీ బహుమతి (శివారెడ్డి గారు), భారత్ భవన్‌వారు నిర్వహించే కవి భారతి కవిసమ్మేళనానికి ఆహ్వానం (ఫణికుమార్, ఘంటసాల నిర్మల గారలకు) తెచ్చుకోగలిగిన మంచికాలం ఇది. ఐనా, ఇంకా ఇంకా కవులు అభివ్యక్తి కళను స్వాధీనం చేసికోవాలి. పుంఖానుపుంఖంగా రాయాలనేమీ లేదు. **అజంతా**, సి. వి. కృష్ణారావుగారిలాంటి సత్కవులు రాసింది వేళ్ళమీద లెక్క పెట్టదగినన్ని కవితలు మాత్రమే. కాని వాళ్ళు ఆర్జించిన అభివ్యక్తి కళ చాలా గొప్పది. ఇవేళ సీనియర్ కవులైన శేషేంద్రశర్మ, సినారె, సోమసుందర్,

ఇస్మాయిల్, సుప్రసన్న, మాదిరాజు రంగారావు, శివసాగర్ మొదలైన కవులు సంతోషపడగల్గిన కొత్త గొంతుకలు సాహిత్యక్షేత్రంలో నిలదొక్కుకున్నాయి. విమర్శకుల బాధ్యత వారిని ప్రోత్సహిస్తూ, సాహిత్య విద్యకు వారినుంచి లభించుతున్న దేమిటో బేరీజు వేయడం. ఈ కృషిలో ఈ వ్యాసం ఒక స్వల్ప ప్రయత్నం.

"కవిత్వం/కనకపు సింహాసనం
దానిపైన/అశ్లీలనినాదాల
శునకాన్ని కూర్చోబెట్టకు
గాడిద/విడిచిన గుడ్డల్ని మోసినట్లుకాదు
అశ్వం వీరయోధుల్ని మోసినట్లు
పదాలు/అర్థగౌరవాన్ని మొయ్యాలి"
[ఆలోచనా వీచికలు - కనపర్తి రామచంద్రాచార్యులు]

అన్న స్పృహ ఈనాటి కవులకు కల్గడం ప్రశంసార్హమైన విషయం. గతంలో వచ్చిన కవిత్వాన్ని, ఇప్పటి కవిత్వాన్ని పరిశీలిస్తే పొడి పొడి మాటలతో రాసే కవులపై ఆదరణ బాగా తగ్గినట్లుగా కన్పిస్తున్నది.

ఒక్కొక్క కవికి ఒక్కొక్క అభివ్యక్తి పద్ధతి కన్పిస్తున్నది. ఒకే వస్తువు మీద ఇద్దరు కవులు రాసినప్పటికీ వారి అభివ్యక్తీకరణనుబట్టే ఆయా కవితలకు ప్రత్యేకత కల్గుతున్నది. దళితులపై హత్యాకాండమీద సోమసుందర్, శేషేంద్ర (ఇరవై అశ్రువులు), నాశేశ్వరం శంకర్ (దళిత దుఃఖం), రాశారు. అభివ్యక్తి ప్రత్యేకతలను బట్టి దేని అందం దానిదే, వీటిని జాగ్రత్తగా పరిశీలించి విడమర్చుకుంటే సాహిత్య విద్య పుష్టిమంత మవుతుంది. [ఈ వ్యాసంలో స్థలాభావంచేత అభివ్యక్తి యొక్క సిద్ధాంత పక్షాన్ని ఎక్కువగా వివరించటం లేదు.] కొత్త గొంతులు సాహిత్య విద్యకు కావాల్సిన ముడిసరుకును చాలానే ఇస్తున్నారు.

''హైందవపద్యానికి అతికిన అయిదవపాదాన్ని నేను."
(వృత్తాంతం - సతీశ్ చందర్)

"మొగ్గ పువ్వుగా మారుతున్న సవ్వడి
గాలి గుండెల్లో పరిమళాలను నాటుతుంది."
(రేపటికి ముందు.... యార్లగడ్డ రాఘవేంద్రరావు)

"నాలోంచి ఏవోపూలకళ్లూ విచ్చుకుంటాయి."
(ఈ నదిని ప్రేమించాను - టి. పతంజలిశాస్త్రి)

"....చనిపోయిన సైనికుడి ఉత్తరం
నాలో కన్నీటిచముర్లై వెలుగుతూంటుంది."
(చీకటి డైరీ - సిద్ధార్థ ; - అభిజ్ఞ I లో)

"తామరతూడు తెగిన / సున్నిత శబ్దాన్ని
నీటిచెలితో ఆలకించినవాడా!" (దుఃఖ గంగ - శిఖామణి)

కవిత్వకళను అత్యున్నత స్థాయిలో సాధించుకుంటున్న కొత్తతరం రాసిన ఇలాంటి అభివ్యక్తులు కొల్లలుగా ఉన్నాయి. ఇవి అన్నీ అతినవ్యాభివ్యక్తులు. సమకాలీనకవిత్వాన్ని పతాకస్థాయికి తెస్తున్న అభివ్యక్తులు.

# పుంజుకుంటున్న పద్యకవిత

—డా॥ ఎల్లూరి శివారెడ్డి

యువభారతి వారు తమ సంస్థ రజతోత్సవాల సందర్భంలో 'పుంజుకుంటున్న పద్యకవిత్వం' అనే అంశాన్ని గురించి ప్రసంగించమన్నారు. అయితే కొందరు సాహితీ ప్రియులకు వెంటనే అనుమానం రావచ్చు- పద్య కవిత్వం పుంజుకుంటున్నదా, గింజుకుంటున్నదా అని! వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యాన్ని ఎన్నో విధాలుగా సమీక్షించిన యువభారతి వారు ఈ అంశాన్ని అలవోకగా, అనాలోచితంగా నిర్ణయించి ఉండరు. పద్యం ప్రాణ పరిత్యాగం చేసిందని స్థూలంగా కొందరు ఊహించడం నిజమే. అయినా ఈ అనుమానం ఏనాడో జాషువా గారికి కూడా వచ్చింది. 'కవితా వాహిని చీలి, పాయలయి యాగంబై యదేచ్ఛారతిన్ ప్రవహింపం దొడగెన్, బురాతనపు ద్రోవల్ పుంతలున్ బాడు పడ్డవి ఛందోనియమాది కూలములు భ్రష్టం బయ్యెనీ మందు వేసవి యందింకునా! సంగమించునా! రసస్వర్గీయ పాథోనిధిన్' అంటూ నలభై ఏళ్ళకు ముందే జాషువాగారు బాధపడ్డారు వెయ్యేళ్ళనుంచి తెలుగునేలలో ప్రవహించే పద్యకవితా వాహినికి వచన కవితల ఆనకట్టలు, గేయాల అడ్డుకట్టలు, గీతికల కాలవలు అడ్డుపడ్డమాట నిజమే! సారస్వత క్షేత్రం ఫలప్రదం కావాలంటే ఈ ఆనకట్టలు, అడ్డుకట్టలు, కాలవలు అనివార్యం. శక్తి పెరుగుతుంది. వేగం హెచ్చుతుంది. ఈ మార్పులు చేర్పులు ఆగనివి. సహజంగా జరుగవలసినవి.

ఆధునిక యుగలక్షణాన్ని అనుసరించి కవితా స్వరూపం మారింది. ఈ శతాబ్ది తొలిదశలో సరికొత్త భావజాలం, విజ్ఞానం దేశాన్ని ఆవరించి ఆకట్టుకున్నాయి. కొత్తభావాలు అందించటానికి కొత్తవాహికలు కావాలి. సమాజంలో భావ వ్యాప్తికి వ్యక్తీకరణ సౌలభ్యం అవసరమయింది. కవితా రచనలో సారళ్యం అపేక్షితమయింది. గురజాడవారు గేయాలవైపు మళ్ళితే,

రాయప్రోలువారు ఎక్కువగా పద్యంలో సరళతను, ప్రసన్నతను సాధించటానికి పూనుకున్నారు. భావకవుల్లో కృష్ణశాస్త్రిగారి లాంటి వాళ్లు పద్యరచనలో కొత్త సొగసులు సంతరించి, చక్కని విరుపులతో పద్యరచనా కళకు నగిషీలు పెట్టారు. పద్యాల్లో ఎన్నో ప్రయోగాలు చేశారు. భావకవుల సౌందర్య దృష్టికి, గత వైభవ పునఃస్మరణకు పద్యం ఎంతగా ఉపయోగపడిందో సామాజిక దృక్పథానికి పద్యం అంతగా ఉపకరించదని అభ్యుదయ కవులు అభిప్రాయ పడ్డారు. అయినా అభ్యుదయ కవులలో ప్రముఖులైనవారు పద్యగతులను కొల్ల గొట్టుకొని వచన కవితకు నడకలు నేర్పారు. కవిత రచనా రూపం మారింది. వచన కవిత సర్వాంగీణంగా రూపొందింది. అయితే జాషువా కవి 'అభ్యుదయ దృక్పథానికి పద్యం కూడా సమగ్రంగా ఉపయోగపడింది' అన్నది మరవటానికి వీల్లేదు. పద్యాన్ని నిరసించటం, నిందించటం అభ్యుదయ కవులలో కొందరికి మానుకోలేని అలవాటుగా మారింది. వచన కవిత అనే దుడ్డు కర్రతో పద్యాల నడుములు విరగదన్నటానికి ప్రయత్నించారు. కర్ర విరిగిందో నడుం విరిగిందో ఇంకా తేలలేదు. పద్య కవుల్లో కొందరు వచన కవితను నిరసించి ఉండవచ్చు. దానికి వచనకవులు చేసిన ఎదురుదాడి చాలా తీవ్రతరమయింది.

వచన కవిత పరిపుష్టమైతే, సమగ్ర కవితా రచన సాధనమైతే పద్యం తనకు తానుగా సాహితీరంగంనుంచి తప్పుకుంటుంది. పద్యం జీవం ఉంది కాబట్టి ఎదిరించి, తట్టుకొని నిలిచింది. జీవం ఉన్న కళ చంపినా చావదు. ప్రాణం లేని కళ జీవకళను వినష్టం చేయలేదు. అభ్యుదయ కవితా యుగంలో వచన కవితతోపాటు పద్యం సాహితీ ప్రయాణం చేస్తూ వచ్చింది. అయితే వచన కవితది రైలు వేగం, పద్యానిది మందయానం. 1930 తరువాత సాహిత్య చరిత్ర తిరుగవేసిన వాళ్ళకు తెలుస్తుంది! అప్పటినుంచి ఎన్ని పద్యకావ్యాలు ఆవిర్భవించాయో, ఎన్ని పద్య ఖండికలు పల్లవించాయో! ఎన్ని నిలిచాయన్నది వేరుమాట. ఆ మాటకొస్తే అభ్యుదయ కవుల్లో మాత్రం రాశికి ఎందరు నిలిచారు? వాసిలో ఎన్ని రచనలు మిగిలాయి?

దిగంబర కవిత్వం సాహిత్యంలోని స్తబ్దతను కొంత తొలగించినా వర్చస్సు కలిగిన కవితను అందించలేకపోయింది. పద్యాన్ని దూషించటంవల్ల దిగంబర కవులు సాధించిందేమీలేదు. విప్లవకవిత ప్రయోజనం వేరు. ప్రయోగం

వేరు. సాహిత్యానికి సామాజిక స్పృహ అవసరం. కాని అది ఏకైక ప్రయోజనం మాత్రంకాదు. సాహిత్య కళకు మరొక ప్రయోజనం కూడా ఉంది. అది అనాదిగా వస్తున్న సంస్కృతిని, నైతిక విలువలను పరిరక్షించటం. వెయ్యేండ్లుగా పరిణతి చెందిన పద్యకళ ప్రయోజనరహితమైందని నిరసించటం భావ్యంకాదు. ఆకలి చల్లారిన మరుక్షణం ఆకట్టుకొనే శక్తి సౌందర్యానికి ఉంది. ఆ సౌందర్య భావుకత తెలుగు పద్య కవితలో సర్వతోముఖంగా రూపొందింది. తిరుపతి వేంకటకవులు పద్యకళ ఈనాటికీ వెలసిపోలేదు. అగ్రపంక్తి వారిదే అయినా ఆ కోవలోకే వస్తారు మరెందరో పద్యకవులు.

ఈనాడు సమాలోచించవలసిన ప్రధానమైన అంశం పద్యం ఈనాటి అవసరాలను తీరుస్తుందా, ఈనాటి వేగవంతమైన జీవితానికి, సాహిత్యానికి ఉపయోగపడుతుందా, అసలిప్పుడు పద్యరచనలో చేయి తిరిగిన వాళ్ళు, ప్రయోగాలు చేయగలిగిన వాళ్ళు ఉన్నారా అన్నది. ఈ విషయాన్ని నిర్మమమంగా సమీక్షించుకోవాలి. ఆంధ్రదేశంలో ఏనాడు పద్యం రాశికి రాకుండా ఉండలేదు. వచనకవిత అంత బిగ్గరగా పద్యం ఘోషించకపోయినా గంభీరంగా మృదువుగా భాషిస్తూనే ఉంది. కరుణశ్రీ ఏనాడూ కలం దించలేదు. ఉత్పల పద్యం రాయకుండా ఊరకుండలేదు. ఉందేల మాలకొండారెడ్డి పద్యంతోనే ప్రయాణిస్తున్నారు. పద్యానికి ఆశ్రయం కరవైంది కాని అర్హత కొరవడలేదు. పండగపూట తప్ప పద్యాన్ని అచ్చువేసుకునే పత్రికా సంపాదకులు లేరు. దానికి పత్రికల వాళ్ళు చెప్పేమాట 'పద్యం అర్థం కాదండీ!' అని. వారిమాట నిజమే అనుకున్నా ప్రతీకాత్మకత, శబ్దచిత్రాలు, అస్పష్టత ఒంటినిండా పులుముకొన్న ఆధునిక వచన కవిత ఎందరికి అర్థం అవుతున్నది? ఆధునిక జీవితం క్లిష్టంగా ఉంది గనుక వచనకవితలో క్లిష్టత, అస్పష్టత అనివార్యం అన్నమాట ప్రామాణిక కవుల స్థాయికి తగినమాట కాదు. కవి అన్నవాడు భావధారను సుగమం చేయాలి. అస్పష్టతను అయోమయాన్ని పారదర్శకంగా మార్చాలి. దర్శనశక్తి (vision) ఉంటేనే అది సాధ్యం. ఇప్పటి కవుల్లో చాలామందికి నిలకడ లేదు. పద్యకవులు తరుచుగా కొత్త భావాలు ప్రదర్శించకపోయి ఉండవచ్చుగాని అస్పష్టత దోషానికి మాత్రం తావివ్వలేదు. 1970 నుంచి గమనిస్తే వచన కవితలో ఎందరి కవితా వాక్యాలు ప్రజల నోళ్ళలో తారాడుతున్నాయి, ప్రచారానికి

నిలువగలిగిన పద్యాలెన్ని ఉన్నాయి అనే సవాలుకు వచన కవితా పక్షాన కూడా జవాబు దొరకదు.

ఈనాడు పద్యానికి ఉన్న ప్రయోజనం ఏమిటి అనే విషయాన్ని పర్యాలోచించాలి. గణితశాస్త్రాన్ని పద్యం ప్రకృష్టంగా చెప్పలేకపోవచ్చు రసాయన శాస్త్రంలోని రహస్యాల్ని పద్యం విప్పలేకపోవచ్చు. కాని, పద్యం రెచ్చగొడుతుంది, ఉత్తేజపరుస్తుంది, జోకొడుతుంది. చీకొడుతుంది. యతి ప్రాసల గొడవ పడలేక ఈ పద్యం మాకొద్దు అనేవాళ్లు పది శతాబ్దులు కష్టపడి తెలుగు సాహిత్య రచనా కళగా తీర్చుకున్న పద్యానికి దూరమైపోతున్నారు. ఈనాడు వచన కవులుగా ప్రసిద్ధులైన వాళ్ళు మేము వందలో వేలో పద్యాలు రాశామని చెప్పుకుంటారు తప్ప - మేము పద్యకవుల మని బాహాటంగా ప్రకటించలేరు. పద్య రచన చాదస్తుల కళ అన్న లోలోపలి ఆత్మన్యూనతా భావమే ఇందుకు అసలైన కారణం. పద్యం సమర్థుని చేతిలో గన్నులా పనిచేస్తుంది. కవికి భావ జాలంతో పాటు శబ్ద ప్రభుత కావాలి. భాషాధికారం లేని కవి రచనా కళలోని రమ్యతకు వెలియై పోతున్నాడు. జీవితంలోని భావ మాధుర్యం చమత్కారం స్పందనలను పద్యకవిత సమగ్రంగా వెలార్చగలదు. భావుకుడైన కవి చేతిలో పద్యం చిక్కదనం సంతరించుకొన్న అనుభూతి సంపుటిగా అవతరిస్తుంది. ఇందుకు ఆధునికుల పద్యాలనుంచి కూడా ఉదాహరణలు చూపవచ్చు. కనుక వచన కవిత చేసే పనులను చేయటానికి పద్యానికి శక్తి ఉంది. ప్రయోగాలు చేసే వాళ్ళు కరవై పద్య రూపం స్థిరంగా ఉండిపోయింది. ఛందశ్శాస్త్రంలోని లక్షల ఛందస్సులను కాలానుగుణంగా, అవసరానుగుణంగా ఉపయోగించుకోవచ్చు. ఈనాడు అందుకు తగిన వాతావరణం ఏర్పడుతున్నది.

ఈనాడు పద్య కళ రెండు ముఖాలుగా సాహితీ ప్రియులకు అందుబాటులో ఉంది. ఒకటి ఈనాటివరకు వెలసిన రచనల అధ్యయనం. రెండవది ఈనాటి పద్య రచనల ప్రభావం. అయితే నేటి పద్య రచయితల్లో ప్రతిభావంతులు, నిష్ణాతులైన కొందరు ప్రముఖుల రచనలు గమనించటం అవసరం. ఇది స్థూలంగా పేర్కొన్న పట్టిక మాత్రమే. కరుణశ్రీ, ఉత్పల సత్యనారాయణాచార్య, ఈట్ల కొండయ్య, వేముగంటి నరసింహాచార్యులు, బేతవోలు రామబ్రహ్మం, ఆచార్య తిరుమల, ముకురాల రామారెడ్డి, జ్ఞానానంద కవి, ప్రసాద

రాయ కులపతి, నాయని కృష్ణకుమారి, లక్ష్మీనరసమ్మ, కనిరెడ్డి మొదలైన పేర్లు మచ్చుకు కొన్ని మాత్రమే.

ఉత్పల వారి పద్య బాణీలు ప్రత్యగ్రంగా, పరువంగా ఉంటాయి. మొన్న మొన్ననే వెలువరించిన 'ఉత్పలమాల'లో కవితా స్థాయిని ప్రస్తుతిస్తూ 'అంచలె కాదయా పరమహంసలు సైతము వచ్చి దివ్య కావ్యాంచిత సారస హ్రదమ్ము నందు విహార మొనర్చినప్పుడే యెంచెద కావ్యమంచది, కవీశ్వరు డాతడె యౌవ టంచు కీర్తించెద వేంకటా చలపతీ! అఖిలాండ పతీ! శ్రియః పతీ!' అంటూ భావవేగంతో దూసుకొనిపోతారు.

కడచిన సంవత్సరం ప్రకటితమైన 'రామబ్రహ్మం' గారి క్రొత్త గోదావరి మళ్ళీ సరికొత్త పద్య కళాసుషమను పంచుతుందేమో అన్నట్లుగా భావుకతను చిలుకరిస్తున్నది. ఉదాహరణకు ఈ పద్యం చూడండి: 'ఆకులు లేక కోకిలల అర్భటి లేక దిగాలు పంచు నిర్లేకత ముంటి వేలనో వచింపవటే సహకారమా యనన్, నాకిపు డాకురాలు తరుణమ్ము గదా యని నవ్వె బాణికిం బ్రాకృతమైన బాధ లలవాటయి పోవుటదెంత మేలొకో!' అని పద్య కళాగానం కోసం ఎదురు చూస్తున్నారు కవి. వట్టి సౌందర్య దృష్టేకాదు, సామాజిక దృష్టి ఈయన పద్యాలలో స్పందనగా నిలిచింది. సమతను గురించి రాస్తూ 'ఒక వ్యక్తికి ఒక వృత్తియు నొకడే యాదాయమార్గ మొనగూర్చుటగా కిక తరుణోపాయములే దకలంకస్థితియు గలుగ నందరు మనగన్' అని ప్రబోధిస్తారు. ఈనాటి పద్య కవులు గోదావరిని గురించే కాదు - చీమల గురించీ అభివర్ణిస్తారు. వేముగంటి నరసింహాచార్యులు గారి ఇటీవలి భావ తరంగణిలో చీమలేమను గురించిన పద్యా లున్నాయి. 'మృణ్మయమ్ములై మేడలు నిర్మించి పరుల కప్పగించి బాధపడని నీదు త్యాగశీల మాదర్శమౌగాక జ్ఞానవంతులైన మానవులకు' అంటూ సాగి పోతుంది వీరి భావధార.

పద్య రచన పరిమళింపజేస్తూ వచన కవితలో వన్నెలు చిలికించే కవులలో డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు ఒకరు. ప్రకృతి ఘోషలో వారి కవితాగళం ఆర్ద్రీభూతంగా సాగింది. "నీలాకాశముతో ఉదాత్త పణితివ్ స్నేహమ్ము గావించు నా శైలాగ్రమ్ముల యందు పుట్టెడి ఝరీ జన్మమ్ములో మున్న యా

లీలాఖేలల వెన్క దాగెడు రసార్ద్రి భూత చేతమ్ములో ఆలోచింపగలేవా సస్య ఫలమున్ అందించు భావోన్నతిన్.' కవితకు అనుభూతి తోడైతే పద్యధార ఇలా సాగిపోతుంది.

మనుషులంతా సమానులే అనేది ఆధునిక సూక్తి. అర్హతలో, కృషిలో అంతా ఒకటి మాదిరిగా ఉండదంటున్నారు 'రీతి నీతి' కవి డా॥ బ్రహ్మాండం నరసింహం. ''వ్యక్తులందరందు రక్త మొక్కటె యుండు, అంతలోనె కారు అందరొకటి; బలమునందు బుద్ధిబలమున నేర్పున వారి వారి తీరు వేరు వేరు' అన్న భావం మర్యాదకోసం కాకుండా మనసారా ధైర్యంగా అన్నమాట. కవికి పద్య రచనలో తొలిమెట్టు శతకం. ఆధునిక కాలంలో వస్తున్న శతకాలు అసంఖ్యాకం. నేటి సామాజిక దుర్గుణాలను వెళ్లబోసుకోవడానికి, కవి తన ఆర్తిని దించుకోవటానికి శతకం చక్కని సాధనం. '92 లోనే వెలువడ్డ విరించి శతకంలో రసిక్‌గారు శ్రమలోని ఉదాత్తతను కంద పద్యంలో కమనీయంగా వర్ణించారు-'పని నొదవెడు సంతోషము, పని నొలికెడు ఘర్మజలము, పని గని లోకుల్ కొనియాడగల్గు మోదము కన సామ్యము లేనివివి జగాన విరించీ' అని. పద్య రచనలు అనేకం సృజించిన ఊట్ల కొండయ్యగారు తమ మృత్యుమాతలో కవితా రచనను గురించి 'కాలమెంతయేని చాలక, విసుగు వేసటలు దరికిరాక, సత్వజవము లంతకంత కధికమౌ కార్యమొక్కటే కలదు, బుధులు దాని కవిత యంద్రుదు' అని సంతృప్తిగా పలికారు కవితాభిమానంతో.

ఇలా కవితా రచనపై పిచ్చి మమకారం చూపిన వారొక వైపుంటే మరొక వైపు పిచ్చివాణ్ణి గురించి వేదనపడి పద్యరచనలో చక్కని భావాలు వెలయించిన కవితా రసరాజులు ఉన్నారు. 'అతడు శప్తజీవి మధురామృతమేదో విషమ్మదేదో తేడా తెలియంగ లేడు - కపటంబు నెరుంగడు - మాయయున్ దగా చేతులు కల్పనట్టి రససిద్ధిని పొందిన యోగిపుంగవుం డాతడు- వానితోడ పరిహాసములా! తగదోయి నీకికన్" అన్నది ఒక సందేశం. పద్యం నవాబుల దౌర్జన్యాన్ని గరీబుల గందరగోళాలను సమానంగా బయట పెడుతుంది. 'మా నిజాం రాజు తరతరాల బూజు' అని మొన్నటి కవి అంటే, 'ఇందిర పార్కుకి పోదామందర మని పిల్లలంటే అబ్బా అంటూ తొందరపడి పోకక్కడ సుందర దోమలకి ముక్కుసూది గరీబూ' అంటూ స్వేచ్ఛగా నేటి కవి అన్నాడు. పద్యరచనను

వినియోగించుకోగలిగితే నేటి అవసరాలకు అనుగుణంగా మలచుకోవచ్చు అని ఈనాటి కవులు అడపాదడపా నిరూపించటం సాహిత్యంలో ఆరోగ్యకరమైన లక్షణం.

ఇటీవల ఉగాదికి ఆంధ్రప్రభ వారపత్రికవారు నిర్వహించిన పద్య కవితల ఎంట్రీలు మూడు వందల దాకా వచ్చాయంటే పద్యరచనాసక్తి పెరుగు తుందనటానికి ఇది ఒక సూచన. ఆరుద్రగారు కేరాలక్ష్మి మకుటంతో రాస్తున్న పద్యాలు పద్య రుచిని పెంచుతున్నాయి. ఇప్పుడిప్పుడే సామాజిక మూల్యాల పున రాలోచన మొదలైంది. రాజకీయ కలుషితమైన కొన్ని సంకుచిత సాంఘిక సిద్ధాంతాల కన్నా మానవతా దృష్టి గొప్పదనే భావన ప్రచలితమవుతున్నది. మానవతా దృష్టి పెంచటానికి పద్య కవితారూపం అన్ని విధాల అర్హమైనదన్న భావం ఈనాడు సాహితీ ప్రియులకు కలుగుతున్నది. "ధర్మమును గూర్చి మాట్లాడదలతువేని కాలు సేతులు అగ్నితో కడిగికొనుము" అంటున్నారు ఇప్పటి పద్యకవులు. ఇంత వర్చసు కలిగిన పద్యం ఇకమీద జీవవిలసితం, తేజోమయం అవుతుందని ఆశిద్దాం. అందుకు యువభారతి సహకారాన్ని అభిలషిద్దాం.

# ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ ప్రమాణాలూ ప్రవృత్తులూ

—ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య

తెలుగులో సాహిత్య విమర్శ ఒక శతాబ్దకాలాన్ని సమర్థంగా అధిగమించి మరో శతాబ్దంలోకి ప్రవేశించే ఉత్సాహకరమయిన సంవత్సరమిది. ఈ విశిష్ట సన్నివేశంలో సాహిత్య విమర్శ తీరు తెన్నులు నేపథ్యంగా ఆధునిక విమర్శ ధోరణులనూ, వాటి తరహాలనూ అనుశీలించుకొనే అవకాశాన్ని కల్పించిన 'యువ భారతి'కి అభినందనలు తెల్పుట ఎంతగా సామయికమయిన ధర్మమో, ఈ వందేళ్ళలో మార్గదర్శకంగా విమర్శకార్యాన్ని నిర్వహించిన మహానుభావులను ఈ సందర్భంగా స్మరించుకోవటం గూడా అవిచ్ఛిన్న విమర్శ సంప్రదాయార్థులకు అంతటి కనీసమయిన ధర్మం.

శ్రీ పి. దక్షిణామూర్తి 1892 ఆగస్టులో వెలయించిన 'పింగళి సూరన'తో తెలుగులో ఆధునికంగా సాహిత్య విమర్శకు అంకురార్పణ జరిగింది. తదాదిగా తెలుగులో సాహిత్య విమర్శకు ఆధునికత్వాన్ని గుణాత్మకంగా సాధిస్తూ క్రమవికాసాన్నీ విస్తృతినీ వేగాన్నీ సాధించిన మేధావులూ, సహృదయులూ అయిన మహానుభావులు ఎందరో మనకు దర్శనమిస్తారు. కాశీభట్ల బ్రహ్మయ శాస్త్రి, వెన్నేటి రామచంద్రరావు, పనప్పాకం సుబ్రహ్మణ్య అయ్యరు, వింజమూరి రంగాచార్యులు, కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు అప్పారావు, ఉమాకాంత విద్యాశేఖరులు, నండూరి బంగారయ్య, రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ శ్రీ వంటివారు తెలుగు సాహిత్య విమర్శ మార్గాన ప్రాతఃస్మరణీయులు, వీరితోపాటు మరింకెందరో తెలుగు సాహిత్యాన్ని పరిశీలించే, విశ్లేషించే రకరకాల విధానాలను, ధోరణులను ప్రవర్తింప జేశారు. సాహిత్య విమర్శకు ఉదాత్తత్వాన్నీ, గౌరవాన్నీ సంపాదించారు. ప్రత్యేక ప్రక్రియగా పెంపొందించి, సాహి

త్యానికి పుష్టికరమూ, ఉపయోగకరమూ అయిన ప్రమాణాలను నెలకొల్పారు. వారి ఉపకారస్మృతి సాహిత్యవిమర్శకుల పురోగతికి దోహదకరమవుతుంది.

మరి, ఈనాడు లబ్ధ ప్రతిష్ఠులయిన కొందరు విమర్శకులు తెలుగు సాహిత్య విమర్శకు ప్రమాణాలు లేవు, లేదా ఇంకా ఏర్పడలేదంటూ బాహాటంగా ప్రకటనలు చేస్తూ పోతూ ఉండటం తరుచుగా కనిపిస్తున్నది. ఈ తరహా ప్రకటనలకు మచ్చుగా- 'తెలుగు సాహిత్య విమర్శకులకు శాస్త్రీయమయిన ప్రమాణాలు లేవు' అంటూ త్రిపురనేని మధుసూదనరావు చేసిన ప్రకటనను ('సుప్రభాతం' పత్రిక 5 మే 1992) ఉదాహరించుకోవచ్చు. ఈ ప్రకటనను వివరిస్తున్న విధంగా- "కొంతమంది ప్రాచీన సంస్కృత అలంకార శాస్త్ర ప్రమాణాలతోనూ, మరి కొందరు పాశ్చాత్య సాహిత్య విమర్శనా ప్రమాణాలతోనూ సాహిత్య విమర్శలు రాస్తున్నారు. తెలుగు నేలనుంచి, తెలుగు ప్రజల జీవిత సంఘర్షణనుంచి ఆవిర్భవిస్తున్న తెలుగు సాహిత్యానికి ప్రాచ్య-పాశ్చాత్య ప్రమాణాలు అన్వయించవని విమర్శకులు గ్రహించడం లేదు" అంటారాయన. ఆయన ఏ విమర్శకులను ఉద్దేశించి ఈ వ్యాఖ్య చేసినా, ప్రస్తుతానికి వీరి గ్రహింపు విషయం అట్లా ఉంచి ప్రధానంగా ఈ వ్యాఖ్యలో గమనించవలసిన అంశం ఒకటి ఉంది. భారతీయమయిన అలంకారశాస్త్ర విధానాన్నీ, పాశ్చాత్య విమర్శనా విధానాన్నీ ఒకే గాట కట్టిచూడటమనేది ఇటీవల కొంత ఎక్కువగా వెలుగులోకి వస్తున్న ప్రమాదకర ధోరణి. సంస్కృతం భారతీయమయిన భాష. ఈ దేశపు సాంస్కృతిక వైజ్ఞానికాది బహువిధ విషయాల వికాస వైభవాలకు అది మూల జీవధాతువు. భారత దేశంలోని అన్ని ప్రాంతాల వారూ సమష్టిగా పెంపొందించుకొన్న ఆ భాషా శాస్త్ర సాహిత్యాదులన్నీ ఈ దేశం మొత్తానికి ఉమ్మడి ఆస్తి. ప్రాంతీయ భాషా వికాసాలకు మూలధనం. మరి, పాశ్చాత్యమయిన ఇంగ్లీషు మనకు విదేశీయ భాష. అంతమాత్రం కాదు; ఈ దేశం మౌలిక జీవన విధాన తాత్పర్యానికి విచ్ఛేదకరంగా పరాయి పాలకులద్వారా ఈ దేశం మీద బలవంతంగా రుద్దబడిన భాష. కాగా, అట్లాంటి ఇంగ్లీషునూ దేశీయమయిన సంస్కృతాన్నీ సమానంగా నిలబెట్టి రెండూ పరాయివే ననిపించే నిర్ణయాలు చేయటం ఈ దేశపు దేశీయతనూ, దాని మూలాలనూ మూల్యాలనూ తెంచివేసే ప్రమాదకరమయిన ధోరణి. కాబట్టి ఈ విధమయిన ఆలోచనా విధానం ఏ విధంగానూ అంగీకరించటానికి వీల్లేనిది. తెలుగు సాహిత్యమనేది మొత్తం భారతీయ సాహిత్యంలో అంగభూతమయినదే

తప్ప మరొకటికాదు. నిజానికి దేశీయమయిన సాహిత్యానికి ఉపయోగపడేవీ, ఉపయోగపడవలసినవీ దేశీయమయిన విమర్శ ప్రమాణాలే తప్ప విదేశీయ, విసాంస్కృతిక విమర్శ ప్రమాణాలు కావు.

ఈ సందర్భంలోనే తెలుగు సాహిత్య విమర్శలో ఈ శతాబ్దపు రెండవ పదిలో సంఘటించిన ఒక సన్నివేశం గుర్తుకువస్తుంది. 1915 లో 'ఆంధ్ర కవితా విమర్శన గ్రంథమాలిక' ఒకటి ఆరంభించబడింది. ఇది వెలువరించిన గ్రంథాలు రెండు. మొదటిది 'పింగళి సూరనార్యుడు'. దీన్ని రచించిన వింజమూరి రంగాచార్యులే ఈ గ్రంథమాలికను ఆరంభించారు. రెండవ గ్రంథం కురుగంటి సీతారామయ్య రచించిన 'అలంకార తత్త్వవిచారము.' దీనికి సంపాదకీయ భూమికను రచిస్తూ - 'కేవలాంగ్ల విమర్శనా నియమములు మన ఆంధ్ర వాఙ్మయమును విమర్శించుటలో పనికిరావు. కేవల పూర్వవిమర్శనా నియములు ప్రస్తుత కాలమునకు తగవు. కావున రెండు విధముల నియమములను సమ్మేళనము చేసి సంప్రదాయము చెడకుండ విమర్శలను సాగింపవలయును. ఇపుడు ప్రచురింపబడుచున్న విమర్శనములు పూర్తిగ సంప్రదాయ నిరసనము చేయుచున్నవి. అట్లు చేయకూడదు. సంప్రదాయ నిరసనము విమర్శనమును పెడద్రోవల కీడ్చుకొనిపోవును. కావున విమర్శనము సరియైన త్రోవల నడువలయును" అన్నారు వింజమూరి రంగాచార్యులు.

ఇదంతా 1914లో వెలువడిన కట్టమంచి రామలింగారెడ్డిగారి 'కవిత్వ తత్త్వ విచారము' నుద్దేశించి చెప్పబడిన అంశం. రామలింగారెడ్డిగారికి భారతీయాలంకార శాస్త్ర సంప్రదాయాన్ని గూర్చిగానీ, సాహిత్య సంప్రదాయాన్ని గూర్చిగానీ, సాహిత్య ప్రక్రియా భేదాలను గూర్చిగానీ సరయిన అవగాహన లేదు. తమకు పరిచితమయిన ఆంగ్ల సాహిత్య విమర్శ విధానాలమీద అభిమానంతో, వ్యామోహంతో తెలుగు సాహిత్యానికి వాటిని పట్టించబోయిన తీరువల్ల ఆయన సాగించిన కవిత్వ తత్త్వవిచారం అనేక మయిన అపోహలకు, అపవ్యాఖ్యానాలకూ దారి తీసింది. ఆయన అలంకార శాస్త్రం గూర్చి అనాలోచితంగా చేసిన అపవాఖ్యల వల్ల ఆ శాస్త్రాన్ని గూర్చిన ఒక నైరస్య భావం ఏర్పడటానికి అవకాశం కలిగింది. ఒక విధంగా చెబితే, వ్యతిరేకముఖ విమర్శకు దారి పడింది. పాశ్చాత్య విమర్శ విధానంలోని అంశాలను నిరాకరించటమనికాక, వాటిలో దేశీయ

సాహిత్య విమర్శ సంప్రదాయానికి, సాహిత్య సంప్రదాయానికీ అనువయిన అంశాలను దేశీయ విధానాలతో సమన్వయించాలని విజమూరి వారి తాత్పర్యం. అందుకే ఆయన ఈ మొత్తానికి 'సంప్రదాయ' విషయాన్ని భూమికగా చేసారు. కాగా, సంప్రదాయ భూమికపై విమర్శ విధానాలనూ, సమన్వయాలనూ, ప్రమాణాలనూ రూపొందించుకోవలసి ఉంటుందనేది ఈ ఉటంకింపు ద్వారా స్పష్ట పడుతుంది.

ఇక్కడ మరొక అంశం గమనించవలసి ఉంది. అలంకారిక శాస్త్ర ప్రమాణాలనేవి ఆ శాస్త్రం ఆరంభమయిన నాటినుంచీ ఒకేవిధంగా ఉన్నవీ కావు, కరుడుగట్టినవీ కావు. సాహిత్య పరిణామక్రమానికి అన్వయించే విధంగా పరిణామం చెందుతూ వస్తున్న వే. ఈ శాస్త్రంలో సాహిత్య విధానాలకూ మార్గాలకూ అనువయిన వెసులుబాటు ఉండటం వల్లనే దాని ప్రామాణికత ఈ నాటికీ గుర్తింపబడుతున్నది. సరయిన అన్వయాలకు ఒదుగుదలనూ, అవకాశాన్నీ కలిగిస్తున్నది. రకరకాల ఆలోచనా విధాలను, విధానాలను తనలో సంలీనం చేసుకోగలుగుతున్నది. కాగా, ఇంతకు ముందు ఉదాహరించిన మధుసూదనరావు మాటల వరుసలోనే— 'అలంకారశాస్త్ర విమర్శ, ఆత్మాశ్రయ విమర్శ తెలుగు సాహిత్య వికాసాన్ని నిరోధించాయి' అన్నదిగూడా వాస్తవాన్ని వ్యక్తీకరించదు. 'ఆత్మాశ్రయ విమర్శ' అనబడేది, నిజానికి, భారతీయాలంకార శాస్త్రం అంగీకరించిన, లేదా నిరూపించిన విధానం కాదు. అదట్లా ఉంచి, అలంకార శాస్త్రం తెలుగు సాహిత్యవికాసాన్ని నిరోధించిందనే దానికి దాఖలా లేవీ కన్పించవు.

ఒక విధంగా గమనిస్తే, ఆధునికంగా 'ఆత్మాశ్రయ విమర్శ' అనటానికి వీలయిన తరహాకు కట్టమంచి రామలింగారెడ్డిగారే ఆద్యులనవచ్చు. ఆయన తన అభిరుచి, అభిప్రాయాలూ, అభిమానాలూ ప్రమాణంగా చేసిన రకరకాల వ్యాఖ్యలు ఇందుకు ప్రధాన కారణం. భారతీయ సామాజికాంశాలను గూర్చి చేసిన వ్యాఖ్యలు గూడా ఇందుకు అపవాదం కావు. దేశ చరిత్రలకూ, సాహిత్యానికీ అవినాభావ సంబంధం ఉంటుదనటం గూడా ఈ దారిలోదే. వీటి విషయం ఎట్లా ఉన్నా, రామలింగారెడ్డి గారు సాగించిన విమర్శ తీరు వ్యతిరేక ముఖంగానే కావచ్చుగాని, ఒక ఉపకారం చేపింది. అలంకారికాంశాలను సృజనాత్మక విధానంలోకాక మొరటుగా కావ్యాలకు అనువర్తింపజేసే ఒకానొక

అనాలోచిత ప్రవృత్తిని అది నిరోధించిందని చెప్పవచ్చు. అంతేకాదు, అలంకారిక ప్రమాణాలను అన్వయించటంలోనూ, సమన్వయించటంలోనూ ఆధునికంగా ప్రవర్తించటానికి బలమయిన ప్రేరణ కలిగించింది. భావనా శక్తిని - దాని కనువయిన ఆలంకారిక భూమికను గుర్తించకున్నా గూడా, ప్రాశ్చాత్యమయిన ఆలోచనా విధానంతోనే కావచ్చు- ఒక ప్రమాణంగా రంగం మీదికి తెచ్చింది. మరొకటి. కథ - ప్రధానంగా పూర్వకావ్యాలలోని కథా స్థూలరూపానికి సంబంధించిన అమరికను గూర్చిన ఆలోచనను రెచ్చగొట్టింది. ఇదే అనంతరకాలాన కథా స్థూల స్వరూపం మీది నుంచి కథా తత్త్వాన్ని గూర్చిన నిశిత విశ్లేషణ విధానానికి దారి తీసిందని చెప్పవచ్చు. నండూరి బంగారయ్యగారు, విశ్వనాథ సత్యనారాయణగారూ నిర్వహించిన విమర్శ విధానాల్లో ఈ అంశం ప్రముఖంగానే స్పష్టపడుతుంది. కావ్యకథా విశ్లేషణలో, నిర్వహణలో కథాకేంద్ర బిందువు యొక్క గుర్తింపుతో కావ్య పరమార్థ దృక్పథంగా సత్యనారాయణగారు నిర్వహించిన సాహిత్య విమర్శ పూర్వాధునిక సాహిత్యాలకు వర్తించేందుకు అనువయిన కొత్త ప్రమాణాలను నెలకొల్పింది. వివిధ ప్రక్రియలను అనుశీలించే, విశ్లేషించే విధానాలను రూపొందించింది.

1928 ప్రాంతంలో ఉమాకాంత విద్యాశేఖరులు తెలుగులో సమకాలీనంగా వెలువడుతున్న భావకవిత్వాన్ని ఉద్దేశించి కొన్ని ప్రశ్నల్ని లేవనెత్తారు. ఆయన 'రకరకాలుగా వెలువడుతున్న మన కవితాస్వభావ మేమిటి? మన నిత్య జీవనంతో, జీవన లక్ష్యంతో ఈ కవిత్వానికి ఉన్న సంబంధ మేమిటి? అదెట్లాంటిది? మనం భారతీయులమయిన ఆంధ్రులం. మిగిలిన ప్రాంతీయులందరి మాదిరిగానే మనం కూడా మనకు వారసత్వంగా లభించిన ప్రాచీన భారతీయ నాగరికతా సంస్కృతులకు గర్వపడుతున్నాం. మరి, ఆ నాగరకతా సంస్కృతుల ప్రగతితోబాటు మనమున్నామా? లేక పతనమవుతున్నామా?' అంటూ నిలదీసారు, భావ కవిత్వాన్ని అనేక కోణాలనుంచి శాస్త్రీయమైన విమర్శ విధానంతో 'నేటికాలపు కవిత్వం' విశ్లేషించారు కవిత్వానికి జీవితంతో అన్వయం, దేశీయమయిన సాహిత్య సాంస్కృతిక వారసత్వం, కవి బాధ్యత, ధర్మభూమిక మొదలయినవాటి నేపథ్యంతో 'ఉదాత్త రసభావన'ను సాహిత్య విమర్శలో ప్రవేశ పెట్టారు. ఈ విధమయిన అంశాల నేపథ్యంతోనే రాయప్రోలు సుబ్బారావు గారు భావ కవిత్వాన్ని విశ్లేషించే విధానంలో ప్రాచీనాలంకారికాంశాలను ఉపయో

గించుకొంటూనే, సమకాలీన జాతీయోద్యమ భూమిక మీద ఆధునికంగా రస దృక్పథాన్ని ప్రస్తుతీకరించారు.

ఈ విధమయిన సాహిత్యవిమర్శ రంగంమీదికి దాదాపు 1935 - 1940 ప్రాంతాల్లో మార్క్సిస్టు సాహిత్య విమర్శవిధానం ప్రవేశించింది. సాహిత్య విమర్శలో సాహిత్యేతర ప్రమాణాలను, పద్ధతులను తొలిసారిగా ప్రవేశపెట్టిందీ విమర్శ విధానం. ఒక 'ఇజం' లేదా 'వాదం' భూమికగా సాహిత్య విమర్శలో ప్రమాణాలను నెలకొల్పటమనేదానికి ఇదే మొదలు. ఒకవిధంగాచూస్తే మార్క్సిజాన్ని సాహిత్య విమర్శకు నేరుగా అనువర్తింపజేయట మిది. ఇందులో ఏమాత్రం పొదుపును గూడా ఇది సహించదు. 1938 ప్రాంతంలో గోపీచంద్, జి.వి. కృష్ణారావుగారల సాహిత్యవిమర్శ వ్యాసాలను విమర్శిస్తూ - "రాయిస్టులు తాము మార్క్సిస్టుల దృక్పథంతో ఆంధ్ర సాహిత్యాన్ని సమీక్ష చేస్తున్నట్లు చెప్పుకుంటారు. అసలు రాయిస్టుల వ్రాతలు మార్క్సిస్టు (శాస్త్రీయ) దృక్పథాన్ని తెలియజేస్తున్నాయో లేదో చర్చించుతాను" అంటూ మద్దూరి చంద్రశేఖర రావుగారు కొన్ని వ్యాసాలు (ప్రజామత - 1938 జులై 10, సెప్టెంబర్ 4) రాసారు. (వీటికి సంబంధించి మరికొన్ని వ్యాసాలు వివరాలు 1974 లో విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రచురించిన 'చంద్రం వ్యాసావళి'లో చూడవచ్చు.) గోపీచంద్, జి.వి కృష్ణారావుగారలు ఆ రోజుల్లో రాయిస్టులు. మార్క్సిజం నుంచి వివిధాంశాలలో విభేదించి విడివడి బయటపడింది రాయిజం. లెనిన్‌కు కుడిభుజంగా పనిచేసిన ఎం. ఎన్. రాయ్ రష్యా నుంచి తప్పించుకొని వచ్చి తన దేశంలో తన అనుభవాలు, ఆలోచనలు, ఆచరణలు ప్రాతిపదికగా ప్రవచించిన 'మార్క్సిజం' మౌలిక విభేదాలవల్ల రాయిజంగా పేరు సంపాదించుకొంది. కాగా, రాయిస్టులది అచ్చంగా మార్క్సిజం కాదని, అందువల్ల వారి విమర్శ మార్క్సిస్టు విమర్శ కాజాలదని చంద్రంగారి తాత్పర్యం. మరి రాయిస్టు విమర్శ అంటూ ఏదీ ఆరంభమయినట్లు కన్పించదు.

మార్క్సిజం సామాజిక చలన సూత్రాలంటూ కొన్ని సూత్రాలను నిష్పన్నం చేసుకొంది. ఆ చలన సూత్రాలు రూపొందటానికి కేంద్రమయిన అంశం ఆర్థిక పునాది. మతం, తత్త్వశాస్త్రం, రాజకీయాలు, న్యాయవిధానం, భాష, సంస్కృతి వగైరా వగైరాలు ఆ పునాదిపైన ఏర్పడే ఉపరితలాంశాలు.

సాహిత్యం గూడా ఈ ఉపరితలాంశాలలో ఒకటి. అందువల్ల మిగతావాటన్నింటి మాదిరిగానే సాహిత్యం కూడా సామాజిక చలన సూత్రాలకు అనుగుణంగానే ఉత్పన్నమవుతుంది. కాబట్టి ఆ చలన సూత్రాలే సాహిత్య విమర్శకు గూడా వర్తిస్తాయి. కాగా, ఆ సూత్రాలే సాహిత్య విమర్శ ప్రమాణాలను గూడా సమకూరుస్తాయి. స్థూలంగా మార్క్సిస్టు సాహిత్య విమర్శ సాగే తీరిది. మార్క్సిజం సూత్రాలే మార్క్సిస్టు విమర్శ ప్రమాణాలనీ, మార్క్సిజంయొక్క అనువర్తింపే మార్క్సిస్టు సాహిత్యవిమర్శ అని స్థూలంగా చెప్పుకోవచ్చు,

అసలు మార్క్సుగానీ, ఎంగెల్సుగానీ కళలనూ, సాహిత్యాన్ని గూర్చి స్పష్టమైన ఆలోచనలు వేటినీ అందించలేదు. నిజానికి వాటిని గూర్చి వారి ఆలోచనలు ఉన్నంతలోనయినా అసంతులితంగానూ, అస్పష్టంగానూ, రకరకాల సందిగ్ధాలతోనూ ఉన్నాయి. తొలినాళ్ళలో వారు ఆర్థిక విషయాలకే అధిక ప్రాముఖ్యమిస్తూ ఆ దృక్పథం నుంచి సాహిత్యాన్ని దర్శించడం జరిగింది. ఈ దర్శనం ద్వారా—"సామాజిక జీవితంలో శ్రమ విభజనకు ఎంతో ప్రాముఖ్యం వుంది. వర్తక వాణిజ్యాలూ, పరిశ్రమలూ పెరిగేకొద్దీ శ్రమ విభజన తీవ్రతరం అవుతుంది. కొందరు వ్యక్తులు భౌతిక వస్తువుల ఉత్పత్తి నుంచి తప్పుకుని భావ వస్తువుల ఉత్పత్తికి పూనుకుంటారు. లాభతృష్ణతో నడిచే పెట్టుబడిదారీ మార్కెట్ తాలూకు ఆర్థకవిషయాల ప్రాబల్యాలవల్ల సాహిత్యం క్రమక్రమంగా 'పారిశ్రామికీకరణ' పొందుతుంది. రచన అనేది కూడా ఒక ప్రత్యేక వృత్తి అవుతుంది" అంటూ వ్యాఖ్యానించారు. కాగా, తొలిదశలో మార్క్సు, ఎంగెల్సులు చేసిన ఇలాంటి సూత్రీకరణలూ, వ్యాఖ్యానాలూ కళాసాహిత్యాలను ఆర్థిక విషయాలకు అధీనం చేశాయి. ఆర్థిక శక్తుల ప్రభావం సమాజంలోగల భావాలమీద బలంగా వుంటుందని, యీ భావాల సంతానం మూలంగా భావజాలం (ఐడియాలజీ) రూపొందుతుందనీ, ఈ భావజాలం ఒక సామాజికవర్గం యొక్క వాస్తవ చైతన్యానికిగాక, కుహనా (ఫాల్స్) చైతన్యానికి ప్రతిబింబమని అన్నారు. భావజాలం దృష్ట్యా కళకు స్వయం ప్రతిపత్తి లేదన్నారు. మరి 'ఇంట్రొడక్షన్ టు ఏ క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ' అనే గ్రంథానికి 1857 లోనూ, 1859 లోనూ రాసిన ముందుమాటల్లో దీనికి భిన్నమయిన అభిప్రాయాలూ, తొలిదానికి మలిదానికీ గూడా విభేదాలూ కనిపిస్తాయి.

మార్క్స్ ఆలోచనల దృష్ట్యా భౌతికసంస్కృతి బాగా వెనుకబడివుండిన ప్రాచీన గ్రీస్‌దేశంలో కళలు బాగా పురోగమించి ఉండటం ఆయనకు మింగుడు పడలేదు. ఈ వైరుధ్యాన్ని సరిగా పరిష్కరించగల సూత్రాలేవీ నిష్పన్నం కాలేదు. రెండోసారి రాసిన ఉపోద్ఘాతంలో ఎటూ తేల్చుకోలేక మళ్ళీ ఆర్థిక విషయాలకుగల నిర్ణయాత్మకశక్తిని పునరుద్ఘాటించాడు. అంతటితో ఆగి పోయింది. ఈ విధమయిన అనిశ్చిత డోలాయమాన పరిస్థితికి సంబంధించిన మరికొన్ని వివరాలు కె.వి. రమణారెడ్డి 'సోషాలజీ అండ్ లిటరేచర్' ఆధారంగా రాసిన 'సాహిత్య స్వాతంత్ర్యవాదం' (సృజన, జులై 1978) వ్యాసంలో వివరంగా గమనించవచ్చు. కాగా, మార్క్స్ సాహిత్యాన్ని, కళలను గూర్చి సరయిన సూత్రాలను గానీ, సమగ్ర సిద్ధాంతాన్ని గానీ ప్రతిపాదించలేకపోయినా మార్క్సిస్టులు ఈ పనికి పూనుకున్నారు గాని, సామాజిక వ్యవస్థకు సాహిత్యాది కళల నన్నింటినీ యాంత్రికంగా లోబరచివేసే పాక్షిక వైఖరినే ప్రదర్శించారనంటారాయన, ఈ వైఖరుల విషయం అట్లా ఉంచి, వివిధ రష్యన్, రష్యేతర మార్క్సిస్టు సాహిత్య విమర్శకుల నేపథ్యంలో— 'సాహిత్యానికి స్వయం ప్రతిపత్తి లేదని, అది నిర్దిష్ట స్థలకాలాల్లో నిర్దిష్ట సామాజిక ధోరణుల ప్రభావంలో తన అస్తిత్వాన్ని పొందుతుందని మొదటినుంచి గుర్తిస్తున్నవారు మార్క్సిస్టు విమర్శకులు' అంటారు. సి. వి. సుబ్బారావు ('విభాత సంధ్యలు' - వ్యాస సంకలనం. పు XII. సౌత్ ఇండియా పబ్లికేషన్స్, హైదరాబాదు) ఈ గుర్తింపు పునాది మీదనే— 'రాజకీయ ఉద్యమాలు, ప్రజాపోరాటం ఉన్నప్పుడే మంచి సాహిత్యం రావడానికి వీలుంది. వాటి నుంచి ఊపిరి పీల్చుకొని ఉత్తేజం పొందిన సాహిత్యమే మంచి సాహిత్యం' అని చలసాని ప్రసాద్ 'సాహిత్యంలో తిరోగమనం: పురోగమనం' అన్న వ్యాసంలో (మనలో మనం - వ్యాస సంకలనం, సాగర గ్రంథమాల, విశాఖపట్నం) సూత్రీకరించారు. అంటే, 'మంచి సాహిత్యం' అనటానికి రాజకీయ ఉద్యమాలు, ప్రజా పోరాటాలు ప్రమాణ మవుతున్నవి. మరి ఇవి సాహిత్యేతర ప్రమాణాలు, 'రచయితలు మానసికంగా భవిష్యత్తుని సోషలిజాన్ని సమర్థించేంతవరకు గొప్ప సాహిత్యం వెలువడబోదని ప్లెహనోవ్, జార్జి లూకాచ్ వంటివారు భావించిన తరహా ఇక్కడ గుర్తుకు వస్తుంది.

నిజానికి రాజకీయోద్యమాలకూ, ప్రజాపోరాటాలకూ మంచి సాహిత్యాన్ని సృజింపచేసే అవకాశం చాలా తక్కువ. ప్రధానంగా నినాదప్రాయమయిన

పాక్షికమయిన సాహిత్యాన్ని మాత్రమే అవి అత్యధికంగా ఉత్పత్తి చేస్తాయి. అదే అసలు కవిత్వంగా, సాహిత్యంగా ఉద్యమాలనూ అయా పోరాటాలనూ అభిమానించేవారు, నిర్వహించేవారు మంచి/ఉత్తమ సాహిత్యంగా కవిత్వంగా ప్రచారం చేస్తుంటారు. ఆ ఉద్యమాలు చల్లారింతరువాత 'నినాదాలు కవిత్వమని ఎవరన్నారు? అట్లా అనటం తప్పు' అని అంటూంటారు. అభ్యుదయ, విప్లవ కవిత్వాలను సరిగా పరిశీలిస్తే ఈ అంశం స్పష్టపడుతుంది. నిజానికి ఆ కవితా రీతులు పై విచార ధోరణికి బలి అయిపోయాయనవచ్చు. ఇదిట్లా ఉంచి, ఈ మంచి సాహిత్య సూత్రీకరణ చేసిన ప్రసాద్ మరో అడుగువేసి— 'రాజరాజ నరేంద్రుని కోసమే కలం పట్టానన్న నన్నయ ఆ రాజు సూర్యవంశపు రాజయి ఉంటే, భారతం బదులు రామాయణమే తెనిగించి ఉండేవాడు' అని నిర్ణయించారు. కవులు రాజుల కనుసన్నల్లో మెలుగుతూ వారికి ఇష్టమయిన విధంగానే కావ్యాలు రచిస్తారనే తప్పుడు అభిప్రాయం మీద ఈ విధమయిన నిర్ణయాలు రూపొందుతాయి. మార్క్సిస్టు సాహిత్య విమర్శ ఈ విధమయిన సాహిత్య విమర్శ ప్రమాణాలకు అవకాశం కలిగించింది.

మార్క్సిజం తాను రూపొందించుకొన్న ఆర్థిక పునాదిమీద చరిత్రను కొన్ని సూత్రాల ప్రకారం అధ్యయనం చేస్తుంది. కొన్ని 'యుగా'లనూ, కొన్ని వ్యవస్థలనూ, వర్గాలనూ, వర్గస్వభావాలను, వర్గపోరాటాలనూ...మొదలయిన వివిధాంశాలను దర్శిస్తుంది. ఈ దర్శనం ద్వారా ఒకానొక కాలంలో ఒకనొక విధమయిన సాహిత్యం వెలువడిందని నిరూపిస్తుంది. ఈ నిరూపణలు అప్పటి సాహిత్యానికి గల నేపథ్యాన్ని మాత్రమే - అపవాదాలు ఎన్ని ఉన్నాగూడా - చెప్పగలవు తప్ప ఆ సాహిత్య విమర్శకు సూత్రాలనూ, ప్రమాణాలనూ నిరూపించజాలవు. ఈ నిరూపణలకు అమరిన సూత్రాలనే విమర్శ ప్రమాణాలుగా ప్రదర్శించటానికి ప్రయత్నిస్తుంది. కాని, అవి యథార్థమయిన సాహిత్య విమర్శ ప్రమాణాలు కావు. అందుకే - 'అప్పటి మార్క్సిస్టు సాహిత్య విమర్శకుల వైజ్ఞానిక సంపుటిలో....ఒక లోపం ఉంది. మార్క్సిస్టు సాహిత్య విమర్శకులకి సామాజిక దృక్పథంలో సాహిత్య విశ్లేషణ చేయడానికి కావలసిన సిద్ధాంత బలాన్నిచ్చే విజ్ఞానం బలంగా ఉండేదిగాని, మార్క్సిస్టుగా సాహిత్యానుభవాన్ని విశ్లేషించడానికీ, సాహిత్య రూపాలను వివరించడానికీ ప్రత్యేకమయిన విధానాలు అందుబాటులో ఉండేవి కావు....(తెలుగు సాహిత్య చరిత్రను మార్క్సిస్టు

దృక్పథంతో పరిశీలించే) పనిలో మార్క్సిస్టు విమర్శకులు సాధించిన ప్రయోజనం జాతీయమైనదే అయినా ఒక యుగధర్మాన్ని విశ్లేషించడంలో వాళ్లు సాధించినంత స్పష్టత ప్రత్యేకంగా ఒక కవినో, ఒక పద్యాన్నో తీసుకొని చర్చించడంలో సాధించలేదు' ('విమర్శకుడు రారా' - మనలో మనం, వ్యాస సంకలనం) అంటారు వెల్చేరు నారాయణరావు. కాగా, ఆ పని సాహసం చేసి మొదలు పెట్టినవాడు రారా (రాచమల్లు రామచంద్రారెడ్డి) అని ఆయన అభిప్రాయం. కాని, అదే వ్యాసంలో - 'తనలో ఉన్నాయని తనకు తెలియని భూస్వామ్య భావాల నేపథ్యమూ, భావకవిత్వాభిరుచుల ప్రాబల్యమూ ఉమ్మడిగా రారాలోని మార్క్సిస్టు సామాజిక విశ్లేషణ సామర్థ్యాన్ని పూర్తిగా లొంగదీసుకున్నాయి.... అంతకుముందునుంచీ అతనిలో ఉన్న పాండిత్యప్రకర్ష, రసవ్యామోహం పరా కాష్ఠకు చేరాయి. కవిత్వ విమర్శకుడిగా రారా పూర్తిగా చల్లారిపోయాడు' అనీ అంటారు. ఈ అంశాలన్నింటిని సరిగా సమాకలనం చేసుకొని చూస్తే, మార్క్సిస్టు విమర్శ సాహిత్య విమర్శకు సాహిత్యేతర ప్రమాణాలను మాత్రమే సంపాదించగలిగింది తప్ప సాహిత్య ప్రమాణాలను సమకూర్చలేకపోయిందనేది స్పష్టపడుతుంది. కాగా వీరందరూ మొదట మార్క్సిస్టులు, ఆ తరువాత సాహిత్య విమర్శకులు.

మార్క్సిస్టు సాహిత్య విమర్శకులు తమ విమర్శలో కావ్య 'వస్తువు'కు దాని విశ్లేషణకూ సర్వేతరమయిన ప్రాధాన్యాన్ని భావిస్తారు - 'వివిధ ప్రక్రియ లను దృష్టిలో పెట్టుకొని తమదయిన ఒక ప్రమాణాన్ని వస్తుగతంగా కల్పించు కొని సూక్ష్మ పరిశీలన చేసే సంప్రదాయం తెలుగు సాహిత్య విమర్శలో ప్రారంభ మయింది' అంటారు మధుసూదనరావు (సుప్రభాతం) ఇక్కడ 'తమదయిన' అంటే తెలుగు వారిదయిన అని తాత్పర్యం. నిజానికి వస్తుగతంగా ఒక ప్రమా ణాన్ని రూపొందించేట్లయితే అది కేవలంగా తెలుగువారికే పరిమితమయింది కానక్కరలేదు. ఎక్కడి దానికయినా ఆ ప్రమాణాన్ని ఉపయోగించవచ్చు. 'వస్తుగతంగా' అనటాన్ని ఆయన వివరించలేదుగాని, వస్తువు ఆధారంగా ప్రమాణాన్ని రూపొందించటం కావచ్చు. ఈ ప్రమాణం కూడా మార్క్సిజం పరిధికి లొంగి ఉండవలసిందే. అట్లాంటప్పుడే అది 'శాస్త్రీయ' ప్రమాణమవు

తుంది. 'తెలుగు విమర్శకులకు' శాస్త్రీయ 'ప్రమాణాలు లేవు' అని ఆయన అన్నప్పుడు గూడా శాస్త్రీయమంటే మార్క్సిస్టు ఆలోచనా విధానానికి లొంగిందనే తాత్పర్యం. ఈ 'శాస్త్రీయ' పదాన్ని మార్క్సిస్టులు చాలా తరుచుగా ప్రయోగిస్తుంటారు. ఈ ప్రయోగంలో ఆ పదం తన వ్యాపకార్థాన్ని కోలుపోయి నిర్దిష్టార్థంలోనే పరిణమిస్తుంది. ఇదిట్లా ఉంచి, సాహిత్యంలో/కవిత్వంలో ప్రధానంగా వస్తుప్రాధాన్యాన్ని ప్రాతిపదికగా తీసుకొని కొన్నేళ్ళుగా వస్తువే తన రూపాన్ని సంపాదించుకొంటుందంటూ మార్క్సిస్టులు సాహిత్యరంగంలో చేసిన ప్రచారం సాహిత్య/కవిత్వపు విలువలు దిగజారిపోవటానికి మిక్కిలిగా సహకరించింది. 'సాహిత్యానికి రూపం గౌణం మాత్రమే.వస్తుగుణం ముఖ్యం' అంటారు రమణారెడ్డి (తెలుగులో అత్యాధునిక కవితారీతులు - స్రవంతి. ఫిబ్ర. 81) ఈ విధమయిన వ్యాఖ్యలే విలువలను దిగజార్చేప్పటికి 'విప్లవ కవిత్వం కృతార్థం కావాలంటే అది విప్లవాశయానికి విధేయమయి ఉండాలి, కవిత్వ గుణానికీ విధేయమయి ఉండాలి' అనే అభిప్రాయానికి రావలసి వచ్చింది. (సృజన, మే 1971) కాని, కలుగవలసిన నష్టం అప్పటికే కలిగింది.

మార్క్సిస్టు విమర్శకులు దేశీయమయిన రస సిద్ధాంతాన్ని అంగీకరించరు. రసానికి ఆనందమే పరమావధి అనీ, దీనివల్ల వ్యక్తి ప్రమత్తుడయి పోతాడనీ, ఉత్తేజంద్వారా క్రియాశీలతా పర్యవసాయిత్వం దీనికి లేదని, అన్నిటికీ మించి అది 'మత' భూమికపై ప్రవర్తిస్తుందనీ - ఈ మొదలయిన రకరకాల అపోహలకు లోనై ఆ సిద్ధాంతాన్ని నిరాకరిస్తారు. ఈ అభిప్రాయాలే నిజమయితే రసాత్మకమయిన వందలేండ్ల కావ్యసాహిత్యం వల్ల సమాజం నిష్క్రియమయి ఉండవలసింది. సామాజిక అభివృద్ధి ఏమీ లేకుండా పోవలసింది. కాని చరిత్ర దీనికి విరుద్ధంగా సాక్ష్యమిస్తున్నది. నిజానికి సాహిత్యానుభవాన్ని విశ్లేషించటానికి పదునయినదీ సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని నిరాకరించటం గూడా సాహిత్యపు విలువలు దిగజారటానికి కారణమయింది. కాగా-

సాహిత్య విమర్శలో మార్క్సిస్టు విమర్శ కలిగించిన అస్తవ్యస్తత, అయోమయం, అపోహలకు ప్రతిగా సాహిత్యస్పృహ అనే నినాదంతో శేషేంద్రశర్మ కవిసేన మేనిఫెస్టో ప్రకటించటం సాహిత్య విమర్శలో ఒక ఆరోగ్యకరమయిన మలుపు. సాహిత్యానికి దాని స్థాయిలో స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరించని

మార్క్సిస్టు విమర్శ సాహిత్య విమర్శలో ఉపయోగకరమయిన ప్రమాణాలను నెలకొల్పటంలో విఫలమయిపోయిన సందర్భంలో కవిసేన మేనిఫెస్టో దేశీయ మయిన భూమికమీద భారతీయాలంకార శాస్త్రం యొక్క వ్యాపకతా లక్షణం నేపథ్యంగా సాహిత్య విమర్శలో కొత్త వెలుగుల్ని ప్రసరించి, ప్రమాణ కల్పన సాధించింది. ఈ సాధన సమన్వయ లక్షణం వల్ల సిద్ధించింది.-'ఈ మేనిఫెస్టోలో పూర్వకాలంలోనూ, ఆధునిక కాలంలోనూ కావ్యశాస్త్రంలో అధికారపురుషులయిన పెద్దల సిద్ధాంతాలే ఆధారం చేసుకొని కవిత్వ తత్త్వ వివరణ చేయబడింది. శాస్త్రంలో అధికార గ్రంథంలో లేనిది ఇందులో లేదు. ఇందులో ఉన్నదంతా అధికార గ్రంథాల్లో ఉంది. ఈ మేనిఫెస్టోలో చేసిన కొత్తపని ఒక్కటే. వర్తమాన ప్రపంచానికి ఉపలభ్యమయిన ప్రాచీన ప్రాక్, పశ్చిమ కావ్యతత్త్వచింతన, ఆధు నిక కావ్యతత్త్వ చింతన, సోషలిస్టు కావ్యతత్త్వచింతన అనే చింతనాత్రయ, లేక చతుష్టయ శాఖల్ని సమైక్యం చేసి పరిశీలించడమూ, ఆ నాల్గింటిలోనూ ఉన్న ఆశ్చర్యకరమయిన భావైక్యాన్ని, అభిన్నతనూ ప్రతిపాదించి, ఆధునిక మానవుడు ఈ విజ్ఞానమంతటికీ వారసుడనీ, ఆ వారసత్వ భారాన్ని మోయడం చేతనే వర్తమాన మానవుడి విజ్ఞానానికి సంపూర్ణత వస్తుందనీ ప్రదర్శిస్తుంది.' (-మేనిఫెస్టో పు. 161)

మేనిఫెస్టో కవిత్వం ఏదో అకవిత్వం ఏదో నిరూపించుకొనే సాధనా లను ప్రదర్శించింది. కేవలంగా వస్తు స్పృహ కాక వస్తువు కవిత్వంగా పరిణ మించటానికి సంబంధించిన స్పృహకు ప్రాధాన్యం కల్పించింది. నిజానికి భారతీయ సాహిత్య విమర్శ వస్తువును, దాని స్వభావాన్ని నిరాకరించలేదు. కవికి సహజంగా ఉండవలసిన స్వేచ్ఛను అనుసరించి వస్తు స్వీకారం జరుగుతుంది. ఈ వస్తువు అపారమూ, సంక్లిష్టమూ అయిన జీవితంనుంచి గ్రహింపబడుతుంది. కవికి గల జీవితావగాహన తీరు ఇందుకు ఉపకరిస్తుంది.

అయితే, వస్తువుకు సంబంధించి ఒకే ఒక షరతు. ఆ వస్తువులో విశ్వ శ్రేయో లక్షణం ఉండాలనేది ప్రధానాంశం. ఏది శ్రేయస్సనేది సమాజంతో కవి పొందే సమన్వయంతో అవగతమవుతుంది. అందుకే జీవితంలో కవి నిమగ్నుడు కావాలని మేనిఫెస్టో అంటుంది. వస్తువును గూర్చిన మౌలికమయిన ఈ షరతు పెట్టి, ఆ వస్తువు కవిత్వంగా పర్యవసింపచేయటంలో ఉపకరించే

తీరుతెన్నుల్ని అలంకార శాస్త్రం అన్వేషించి ప్రదర్శించింది. ఈ ఆలంకారిక చింతనలోని వ్యాపక లక్షణాన్ని సౌజన్యమయిన ఇతర చింతనలతో సమన్వయించటం ద్వారా దేశీయ స్థాయి నుండి వైశ్విక స్థాయికి సాహిత్య విమర్శను మేనిఫెస్టో ఎదిగించింది. అందుకే సాహిత్యంలో విశ్వమానవ స్వభావం అభివ్యక్తమవుతుందనీ, అది దేశకాలావరణ నిబద్ధమవుతూనే ఆవరణాలను విచ్ఛిన్నపరచే అనుభవం ప్రసాదిస్తుందనీ ప్రతిపాదించగలిగింది. మేనిఫెస్టో రకరకాల విమర్శలకు తొలి నాళ్ళలో గురయినా గూడా తెలుగు సాహిత్య విమర్శను ప్రభావితం చేయటంలో వెనుకంజ వేయలేదు.

ప్రాచీన కావ్యాల్లో శిల్పానుశీలన విషయం ప్రసిద్ధమే కాగా, ఆయా కావ్యాల్లోని జీవన తత్త్వానుశీలనమనేది ఆధునిక సాహిత్య విమర్శలో కన్పించే ఒక విశేషం. మను చరిత్రను గూర్చి ఈ విధమయిన తత్త్వానుశీలనంతో ఆర్. ఎస్. సుదర్శనం ప్రముఖులు. నిజానికాయన ఈ విధమయిన అనుశీలనాన్ని ఆధునికమయిన నవలలతో ఆరంభించారు. నాటకాన్ని స్వీకరించారు. విశ్వనాథ, గోపీచంద్, గురజాడలతో ఆరంభించి, మను చరిత్రకు తన విశ్లేషణను అనువర్తింప జేసారు. ఈ రకమయిన విశ్లేషణ సాహిత్యంతో ఆయా కావ్యాల, రచనల స్థాయిని అంచనా వేయటానికి, ఆలోచన పరిధిని విస్తరింప జేయటానికి ఉపకరించింది.

తెలుగు 'సాహిత్య' విమర్శ అనటమే కాని, ఈ విమర్శ ప్రధానంగా కవితా విభాగాన్ని ఆశ్రయించి సాగినట్టూ, సాగుతున్నట్టూ గమనించటం సులభమే. సాహిత్యం అనేది కేవలం కవిత్వాన్ని మాత్రమే గాక నవల, కథ మొదలయిన అనేక వచన ప్రక్రియలను గూడా సమావరించుకొనే అంశం. కథ, నవల, రూపకం, వ్యాసం ప్రధాన వచన ప్రక్రియలు. వీటిలో కథ, నవల పొందినంత విస్తృతి నాటకానికి కలుగలేదు. ఇప్పటికీ గురజాడ కన్యాశుల్కాన్ని పట్టుకొని దానిచుట్టూ తిరుగటమే తప్ప మరే నాటకాన్నీ అంతగా అనుశీలించిన తీరు కన్పించదు. వ్యాసమనేది విమర్శ వ్యాసంగానే విస్తరించింది తప్ప, అచ్చంగా వ్యాసం అంతగా ఎదుగలేదు. కథ, నవలల్లో గూడా నవలలను గూర్చిన విమర్శ మాత్రమే అధికంగా కన్పిస్తుంది. ఇందులోనూ విడివిడిగా నవలలను అధ్యయనం చేయటమే ఎక్కువ. నవలల్లో మనోవిశ్లేషణగా కోడూరి

శ్రీరామమూర్తి వంటివారూ, నవలాశిల్పం వంటి వాటికి సంబంధించి మొదలి నాగభూషణశర్మ, వల్లంపాటి వెంకట సుబ్బయ్య వంటివారు నవలా విమర్శకు వేసిన దారులు మరింత విస్తరించవలసిన అవసరం కన్పిస్తూనే ఉంది. విమర్శ విస్తరిస్తే తప్ప ప్రమాణాలు రూపొందటం కష్టం.

సాహిత్య విమర్శకు 'సాహిత్య విమర్శ' కూడా విషయమే. ఈ సందర్భంగా గమనించవలసిన అంశం ఒకటి ఉంది. ప్రాచీనాలంకారిక సిద్ధాంత గ్రంథాలు చాలా వరను తెలుగులోకి అనువదించబడ్డాయి. ఈ అను వాదాలు తెలుగువారికి ఎంతగానో ఉపయోగించాయి కాని, ఈ గ్రంథాలను గూర్చి గానీ, వీటిలోని వివిధ విషయాలను, ఆలంకారికి సిద్ధాంతాలను గూర్చి గానీ చెదురుమదురుగా తప్ప విశ్లేషణ, సమన్వయాత్మక వివేచన సాగినట్లు కన్పించదు. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి వంటివారు ఒక్కొక్క రసాన్ని తీసుకొని రససిద్ధాంతాన్ని విశ్లేషించారుగాని దానికి అంతగా వ్యాప్తి రాలేదు. జి.వి. సుబ్రహ్మణ్యం 'వీరరసం' గూర్చి చేసిన విశ్లేషణ ఈ తరహాలోని విశి ష్టంగా చెప్పుకోవలసిన వివేచన. వీరరసం వ్యాప్తి దాని ఔదాత్త్యాన్ని, అములునూ ఇంచుమించు సక్రమంగా చర్చించిన గ్రంథం. హాస్యరసం గూర్చి కూడా ఈ ధోరణిలోనే ఒక సంగ్రహ విశ్లేషణ జరిగింది. కాని, మిగత రస విషయా లకు సంబంధించిన వివేచన ఇంకా సాగవలిసేవుంది. కేవలం రస విషయమే కాక ధ్వన్యాది సిద్ధాంతాలను గూర్చి గూడా వివేచన వెలువడితే తప్ప ఆ శాస్త్రం సాధించిందేమిటి? ఆ పునాదులమీద ఇంకా సాధించవలసిందేమిటి? అనేది తేలదు. అది తేలటం సాహిత్య విమర్శకు ఎంతో ఉపకార మవుతుంది. ఇదిట్లా ఉంచి, ఆధునిక సాహిత్య విమర్శకుల విమర్శ స్వరూప స్వభావాలను, వారు సాధించిన అంశాలను విశ్లేషించవలసిన అవసరం కూడా ఉంది. సంపత్కుమారాచార్య 'ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ: సంప్రదాయ రీతి" అనేది శ్రీశ్రీ దాకా వివిధ విమర్శకుల విమర్శ విధానాలను సంప్రదాయ భూమికపయి విశ్లేషించింది ఇది మరింత వ్యాపకంగా జరుగవలసి ఉంది. జి. వి. సుబ్రహ్మణ్యం 'ఆంధ్ర సాహిత్య విమర్శ: ఆంగ్ల ప్రభావం' తెలుగు సాహిత్య విమర్శలో వచ్చిన పరిణా మాలను ప్రభావాల భూమిక పీద విశ్లేషించింది. తెలుగు సాహిత్య విమర్శ తనను తాను విశ్లేషించుకోవటానికి అనువయిన రంగం ఎస్. వి. రామారావు

'తెలుగులో సాహిత్య విమర్శ' సిద్ధం చేసింది. ఈ రంగాన్ని మరింత విస్తృత పరచుకోవాల్సిన అవసరం ఉంది.

తెలుగు సాహిత్య విమర్శలో ఈనాడు మరొక ఆరోగ్యకరమయిన తీరు నెమ్మదిగా అమలులోకి వస్తున్నది. ఆధునికంగా కవితాభాష, అభివ్యక్తి వైలక్షణ్యం, రచనా, నిర్మాణ వ్యూహాలు రానురాను సంక్లిష్ట లక్షణాన్ని సంపాదించుకోవటమనేది వ్యాపిస్తున్నది మరి, ఈ విధమయిన కవితా రీతుల్లోని వాంఛనీయ - అవాంఛనీయాంశాలను విశ్లేషిస్తూ వాటి ఆస్వాదనీయతకు కవితా పాఠకులను అలవాటుపరిచేవిధమయిన ప్రయత్నం చేరా 'చేరాతలు'లోనూ, ముదిగొండ వీరభద్రయ్య 'అనుభూతి కవిత్వం - కొన్ని వ్యాసాలు' వంటి వాటిలోనూ సఫలంగా సాగుతున్నది. అట్లాగే వివిధ వాదాలు - ప్రతీక వాదం వంటి వాటి అంతస్తత్వాన్నీ, వాటి వ్యాప్తినీ పరిమితిగా విశ్లేషించటం గూడా గమనించదగిన అంశం.

విషయ సమగ్రతకు ప్రస్తుత పరిధి చాలదు. అందుకే కొన్ని కొన్ని అంశాలను గూర్చి గూడా ఇది, నిజానికి, స్థూలమయిన ప్రస్తుతీకరణ మాత్రమే.

# కథానిక – రూపపరిణామం

—డా॥ ముక్తేవి భారతి

కథలంటే పైపైని వున్నాయనుకున్నావేమో. ఇది కల్పించడానికి చాలా గొప్ప ప్రతిభ వుండాలి. వాటి విలువ తెలుసుకోడాని కెంతో పరిజ్ఞానం వుండాలి. అవి చెప్పడానికెంతో నేర్పుండాలి. అవి వినడానికెంతో రుచి వుండాలి. అవి బోధపరుచుకోడానికెంతో బుద్ధి సూక్ష్మత వుండాలి. కథలు కళ్ళకు వెలుగిస్తాయి. బుద్ధికి పదును పెడతాయి. మనస్సుకి ఉత్సాహము, ఉల్లాసము కలిగిస్తాయి. జడుసుకున్నా కల్పనాశక్తి ప్రతిపాదిస్తాయి. నిజంగా, ఒక్కొక్క కథ యేలాంటి ఘట్టంలోనూ కూడా ఒక్కొక్కళ్ళని ఒడ్డెక్కిస్తుంది.

"కథలు చదవడమూ, అధమం వినడమూ యెప్పుడూ దండుగ అనుకోకేం"— శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి మాటలు కథా సాహిత్యమున్నంత కాలం చిరస్మరణీయాలు.

తెలుగు సాహిత్యంలో కథానికను గురించి ఎప్పుడు ప్రస్తావించినా కథను స్మరింపక తప్పదు.

తెలుగు కావ్య రచనారంభం నాటినుంచీ కూడా కథ ఊపిరిపోసుకుందంటే అతిశయోక్తి కాదు. సాహిత్య పోషకులైన రాజులు ఇష్టకథా గోష్ఠిలో మునిగి తేలారు ఆనాడు. ఆదికవి నన్నయ ప్రసన్న కథా కలితార్థయుక్తితో భారత కథ కుపక్రమించాడు. నన్నెచోడుడు కుమార సంభవాన్ని దివ్యకథగా పిలిచినా, శ్రీనాథుడు కాశీఖండంలో సుశీల కథ, గుణనిధి కథలు మలచినా, మార్కండేయ పురాణంలోని కథని మనుచరిత్రగా అల్లసానివారు అల్లినా, సాహితీ సమరాంగణ సార్వభౌముడు యామునాచార్యుని కథ, మాలదాసరి కథ మొదలైనవి ఆముక్తమాల్యదలో తీర్చిదిద్దినా— ఇలా తెలుగు కావ్యాలలో ఎన్నో కథలు పరోక్షంగా భాసించాయి. కథా కావ్యాలుగా సింహాసన ద్వాత్రింశిక, హంస

వింశతి మొదలైనవి పేలిముసుగు లోంచి తొంగి చూసాయి — అంటే ఏరూపంలో వున్నా కథకి 'చెవికోసుకోటం' అనేది కథాసాహిత్య పరంగా సార్థకమయిందని స్పష్టమవుతోంది!

ప్రపంచం మొత్తంగా 19 శ॥ అన్ని రంగాలలోను ప్రత్యేకతను సంత రించుకున్నట్లే, సాహిత్య రంగంలో కూడా కొన్ని ప్రత్యేకతలను సాధించింది. భాషా సాహిత్యాలు అధ్యయనం చేసే కళాశాలల, విశ్వవిద్యాలయాల స్థాపన, పత్రికల ఆవిర్భావం, ముద్రణాయంత్రాల రాక మొదలయినవెన్నో సాహిత్య రంగానికి ఎంతో తోడ్పడ్డాయి. పాశ్చాత్య సాహిత్య ప్రభావం ప్రవాహంలా తోసుకొచ్చింది. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు చేపట్టిన కందుకూరి వీరేశలింగం లేఖిని కథవైపు మొగ్గింది. 'నీతికథామంజరి' వెలువడింది. తెనాలి రాముని కథలు, మర్యాద రామన్న కథలు, విజయనగర రాజుల కథలు, బుద్ధుని జాతక కథలు, కాశీమజిలీ కథలు - ఇలా ఎన్నో కథలు ప్రచారంలోకి వచ్చాయి.

సంఘ సంస్కరణోద్యమంతోపాటు సాహిత్యోద్యమం కూడా బెంగాలు లోనే ప్రారంభమయి, అన్ని దేశాలు ప్రాకింది. అటు ఉత్తర దేశాన్ని ఇటు దక్షిణ దేశాన్ని కూడా ప్రభావితం చేసిన సాహిత్యోద్యమంలో భాగంగా రవీంద్రుని, శరత్ చంద్రుని రచనలు తెలుగు రచయితల్ని కూడా ప్రభావితం చేసాయి.

వీరేశలింగంగారివరకు కథపైనే దృష్టిపడింది కానీ కథానిక రంగంలో కొచ్చేసరికి యుగకర్త గురజాడ అప్పారావు చూపు నిలిచింది.

కథకి కథానికకి ఉన్న అంతరం ఎంత అని ఒక్కసారి పునరాలోచించాలి.

"ఒక నిర్దిష్ట సాహిత్య ప్రక్రియగా రూపొందించిన అధునిక వచన రచనా విశేషం కథానిక. మామూలు కథ కంటె ఇది సునిశితం. సూక్ష్మతరం. ప్రతి కథానికా ఒక కథే కాని ప్రతి కథా కథానిక కాదు. రచయిత ఏం చెప్పాదన్నది రెంటికి వర్తిస్తుంది. కానీ ఎలా చెప్పాదన్నది కథానికకే వర్తిస్తుంది. కథ ముడి వజ్రం, కథానిక సానబెట్టిన వజ్రం. దీని అందం దానికి లేదు. దీని పనితనం దాంట్లో లేదు" - అంటారు పోరంకి దక్షిణామూర్తిగారు. (కథానిక స్వరూప స్వభావాలు.)

యుగకర్త గురజాడ మొట్టమొదటి కథానికా రచయిత కావటం విశేషం.

"గారడీవాని మామిడి మొక్కలాగ, గురజాడ అప్పారావు చేతిలో తెలుగు కథ అప్పటికప్పుడు మొలిచి పూచి కాచింది. సాహిత్య విషయాలలో కూడా అద్భుతాలనేవి ఉంటే, ఇది అలాంటిది. మధిర సుబ్బన్న దీక్షితుల కాశీమజిలీలు, ఎర్రమిల్లి మల్లికార్జునిడి చార్ దర్వేష కథలు, తాతాచార్యుల కథలు వగైరా వగైరా తెలుగువాళ్ళకు కాలక్షేపాన్ని, వినోదాన్ని కలిగించే రోజులలో, గురజాడ అప్పారావు కథా రచనలో పరిపూర్ణమైన విప్లవమే కలిగించాడు. చిన్నకథ అప్పారావు మానస పుత్రిక"-అంటూ కె.వి. రమణారెడ్డిగారు 'మహోదయం'లో వివరించటం తెలుగు కథానికకు ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించటమయింది.

గురజాడవారు రాసినవి ఐదు కథానికలు- దిద్దుబాటు, నీ పేరేమిటి, మెటిల్డా, పెద్దమసీదు, సంస్కర్త హృదయం. దిద్దుబాటు 1910 లో 'ఆంధ్ర భారతి'లో ప్రచురింపబడింది. ఆనాటి సాంఘిక సమస్య అయిన వేశ్యాలోల త్వాన్ని నిరసిస్తూ, వేశ్యాప్రియుడైన గోపాలరావు పాత్ర, అతన్ని చక్కదిద్దే భార్య కమలిని పాత్ర, వారి విశ్వాసపాత్రమైన నౌకరు రావుడు పాత్ర - ఈ ముచ్చటైన మూడు పాత్రలలో శిల్పం, వస్తువు, భాష అనే మూడు ప్రధాన అంశాలతో దిద్దుబాటు కథానికకి ప్రాణంపోశారు గురజాడ.

అయితే ఇక్కడ 'చిన్నకథ' అనే మాటను వివరించాలి. ఈ 'చిన్నకథ' కథానికేనా? చిన్నకథ పాశ్చాత్య సాహిత్యంలోని షార్ట్‌స్టోరీ ఏనా? పరిమాణం దృష్ట్యా చిన్నదికనక చిన్నకథ అని అనటం వుంది. చిన్నగా వున్న కథ 'కథానిక' కాకపోవచ్చు. కొన్నిసార్లు పరిమాణంలో పెద్దదయినా లక్షణాన్నిబట్టి కథానిక కావచ్చు. ఈ సందర్భంలో 1936 లో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు కథానిక అనే పేరు గురించి వివరించింది చెప్పుకోవాలి. (ప్రతిభ పత్రిక 1936)-

"చిన్న కథ పరసారస్వత పరిపాటివల్లనే మనకు వచ్చిందని ఒక అపోహ అను్రుతముగా ఉన్నది. English short story కి అనువాద రూపమయిన హ్రస్వ కథ, చిన్న కథ, కథానకము అనే పేర్లతో తలకొక రీతిగా మనలో కొంత మంది వాడుతున్నారు. దీన్నిబట్టి మన పూర్వ సాహిత్యంలో ఇటువంటి రచన ఉన్నట్టు మనవారికి తెలియదని తోస్తున్నది" అని అంటూ అక్కిరాజు ఆంజనేయశర్మ గారు తమ సారస్వత వ్యాస సంపుటిలో Short story కి

దక్షిణామూర్తిగారు మొదలైన కథకులు ఐదు నిముషాలు చొప్పున ఒక్కొక్క కథని చదివారు. చిన్న వాక్యాలుండటం, వ్యవహారిక భాషలో ఉండటం, సంభాషణలు తక్కువ వుండటం దీని ముఖ్య లక్షణం.

కార్టూన్ కథలు అనేకాసిని పత్రికలు బాగా ప్రోత్సహిస్తున్నాయి. ఈ కథలకి ప్రత్యేక బహుమతులు ప్రకటించటం కూడా వుంది. హాస్యం, వ్యంగ్యం ఈ కార్టూన్ కథల లక్ష్యం. వాటిల్లో కథనం కన్నా కార్టూన్ గీయటమే దాని శిల్పం.

ఇవన్నీ కథానికా రూప పరిణామంలో అంతర్భాగాలైనా, ఆధునిక పత్రికా ప్రపంచం మరికొన్ని కొత్త అంశాలు ప్రవేశ పెట్టింది. కథానికా తీరుతో కొత్త మార్పులు బాగా కనిపిస్తున్నాయి.

వీటిల్లో కాలమ్ దాటని కథలు చాలా ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఒక పత్రిక ఒక కాలంలో ఎన్ని పదాలుంటాయో వాటినే లక్ష్యంగా పెట్టుకుని ఒక చిన్న సంఘటనని కథగా చెప్పాలి.

ఈమధ్య పత్రికల్లో సరసకథలు, సరసశృంగార కథలు కనిపిస్తున్నాయి. వీటికి పేజీల సంఖ్య పరిమితి వుంటుంది. కథా ప్రహేళిక అని శీర్షికని ఒక పత్రిక నిర్వహిస్తోంది. స్కెచ్‌ని సంపాదకుడు తెల్పుతే, దాని ఆధారంతో కథను రాయాలి. ఇది ముఖ్యంగా యువ రచయితలకు ప్రోత్సాహకరంగా ఉంటుంది. కథా రచనా శిల్పం అలవరచుకొనేందుకు ఉపకరిస్తుంది.

తెలుగు కథానిక యుగకర్త గురజాడతో ప్రారంభమయి, పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన'తో అంతర్జాతీయ కథా స్థానాన్ని సంపాదించి, ఇంతింతై, మరెంతో అయి తెలుగు కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తోంది.

కథానిక విభిన్న రూపాలు పొందినా, వాస్తవికతని, సామాజిక స్పృహని నిలుపుకుంటూ, కొత్త గొంతులతో మరికొన్ని కొత్త రూపాలు దిద్దుకుంటుందని ఆశిద్దాం.

# ప్రచారసాధనాలు-మారుతున్న విలువలు

—ఆచార్య పేర్వారం జగన్నాథం

ఏదైనా ఒక విషయాన్నిగానీ సమాచారాన్నిగానీ ప్రజా సమూహాలకు ఒక్కుమ్మడిగా అందించే ప్రక్రియ ప్రచారమవుతుంది. ఈ ప్రక్రియకోసం ఉపయోగించే వ్యవస్థలను సాధనాలంటాము. పూర్వకాలంలో ఉన్న సాధనాలు వేరు. నేడు ఉపయోగంలో ఉన్న సాధనాలు వేరు. వాటి పనితీరుకూ వీటి పనితీరుకూ ఎక్కడా పోలికలు లేవు. అట్లాగే నాటి ప్రచారవస్తువుకూ నేటి ప్రచార వస్తువుకూ ఏ మాత్రం పోలికలు లేవు. వైజ్ఞానిక సాంకేతిక రంగాల్లో మానవుడు సాధించిన విజయాలన్నింటినీ నేటి ప్రచారసాధనాలు సమర్థవంతంగా వాడుకుంటున్నాయి. అందువల్ల నేటి ప్రచార సాధనాలు తక్కువ శ్రమతో అతి తక్కువ వ్యయంతో ఎక్కువ ప్రజలకూ ఎక్కువ ప్రదేశాలకూ అంతకుమించి ఖండాంతరాలకూ సులభంగా సమాచారాన్ని అందజేస్తున్నాయి. ఇది నేటిమానవుడు సాధించిన ఘన విజయం.

పూర్వం ప్రజలకు ఏదైనా సమాచారం అందించాలంటే గ్రామగ్రామానికి వెళ్ళి దండోరా వేసి ప్రజల్ని ఒక చోటికి సమీకరించి సమాచారాన్ని తెలుపుతుండేవాళ్ళు. లేదా ఏదైనా ఒక విషయాన్ని ఎల్లప్పుడూ ప్రజలకు తెలుపుతూ ఉండవలసిన అవసరాన్ని గుర్తించినప్పుడు వాటిని శిలాశాసనాలద్వారా ప్రకటిస్తూ ఉండేవాళ్ళు. ఐతే వీటికి చలనశీలత లేదు. నిశ్చలంగా నీరసంగా సమాధిస్థిత మునిపుంగవులవలె ఉండి ఈ శాసనాలు ప్రజలకు మౌన సందేశాలను అందిస్తూ ఉండెడివి. ఇక సాహిత్యంలోకి వెళ్ళితే వివిధ రకాలైన పక్షులు ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి, ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికీ సమాచారాన్నో, సందేశాన్నో చేరవేసిన ప్రసక్తి కన్పిస్తుంది. ఇదికాక హనుమత్సందేశం,సంజయ రాయబారము వంటివి ఉండనే ఉన్నాయి. వీటిలో ఒకరి అభిప్రాయాన్ని మరొకరికి అందజేయడమే తప్ప సామూహిక ప్రయోజనాన్ని ఆశించే ప్రజా బాహుళ్య ప్రసక్తి లేదు. కనుక ఇవి ప్రచార ప్రక్రియలోకి చేరవు.

సరియైన పేరు లేదని, ఇంచుమించుగా హ్రస్వ కథ, చిన్న కథ అనవచ్చుననీ, దీనికి మూలం బ్రాహ్మణోపనిషదాది వైదిక వాఙ్మయమూ, పంచతంత్రము, హితోపదేశము, బేతాళ పంచవింశతి మొదలయినవి కావచ్చునని తెల్పారని చెప్తూ, - దీనికి మన సాహిత్యంలో 'కథానిక' అన్న పేరు సిద్ధమైయున్నది" అని వివరించారు.

కథానిక లనదగినవి అన్ని పురాణాలలో వున్నాయని తెలుస్తుంది. కథానికకు ముఖ్యలక్షణం క్లుప్తత. అద్భుతమైన ముగింపు.

పాశ్చాత్య కథానికా లక్షణాలలోనూ ముఖ్యంగా కనిపించేవి ఇవే. కనక, కథానిక పూర్తిగా పాశ్చాత్య సాహిత్యం నుంచి తీసుకున్నాము అనటం కన్నా ఆ లక్షణాలు అంతకుముందే మన సాహిత్యంలో వున్నాయని,పాత కొత్తల మేలు కలయికలాగ కథానిక రూపం దిద్దుకుందని తెలుసుకోవటం సమంజసం అనిపిస్తుంది.

కథానికకు ముఖ్యమైన అంశాలు రెండు :

సమాజంలోని సంఘటనలు, వ్యక్తిగత అనుభవాలు మొదలయినవి ఏకోన్ముఖంగా కథారచనలో సాగటం, అవసరమయినంతవరకే కథ చెప్పటం-అంటే స్వయంసమగ్రత పాటించటం - వీటిలో, శిల్పానికి, కథానికలో ఎక్కువ ప్రాధాన్యం వుంది.

తెలుగు కథానికా రచయితలుగా శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చింతా దీక్షితులు, మొక్కపాటి నరసింహశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి, చలం, కొడవటిగంటి, రావిశాస్త్రి, చాసో, కాళీపట్నం, మధురాంతకం రాజారాం, వాసిరెడ్డి సీతాదేవి, ఇల్లిందల సరస్వతీదేవి, మాలతీ చందూర్ - ఇలా, ఎందరెందరో తెలుగు కథా సాహిత్యానికి పట్టుకొమ్మలై నిలుస్తున్నారు.

కథానిక రూప పరిణామ దశను గుర్తించాల్సిన అవసరం వుంది.

వచన సాహిత్యంలో అంతర్భాగాలైన శాఖోపశాఖలు కథానికలో కూడా అంతర్భాగాలే అనిపిస్తాయి. కథానిక,నవల అనేవి కథాత్మక వచన ప్రక్రియలే. అయినా కథానికకి దగ్గరగా వుండేవి నవలిక, పెద్దకథ. అంటే కథానిక లక్షణాలే వుండి పరిమాణాన్ని బట్టి మరోపేరు పెట్టుకున్న ప్రక్రియ లనవచ్చును.

నవలిక అనేది చిన్న నవల అనుకుంటే కథానిక లక్షణమైన శిల్పమూ ముగింపులో విశేషము నవలికలోనూ వుంటాయి. కనక నవలిక, పెద్దకథ అనేవి రెండూ కథానిక లక్షణాలను కొంతవరకు అంది పుచ్చుకోటం వలన కథానిక పరిణామ రూపాలని చెప్పవచ్చు. అలాగే, గల్పిక అనేది కూడ కథానికా రూపమే కానీ ఆకారంలో గల్పిక చిన్నది. కథానికలో ఒకే విషయానికి, అంటే ఏకత్వానికి ప్రాముఖ్యమిచ్చినట్టు, గల్పికలో ఏకత్వంలోని ఏకాంశానికి ప్రాధాన్యమివ్వటం జరుగుతుంది. ఏకైకత్వం కాబట్టి గల్పిక ఆకారంలో కథానిక కన్న చాలా చిన్నది. ఇది హేళన పూర్వకమైన, హాస్యాత్మకమైన రచన కంది. కథానికలాగ గల్పిక కూడా చదువరిని ఆశ్చర్యపరచాలి. కొసమెరుపు వుండాలి. అయినా, పాఠకుడిని ఆలోచింప చేయాలి. కథానికలాగే క్లుప్తత, ముగింపు వుంటూ కథానిక యొక్క మరో చిన్నరూపం గల్పిక.

కథానిక కంటె చిన్నది స్కెచ్ అనేది. వాటిలో కూడా ఒక్క సన్నివేశాన్నో, ఒక్క మానసిక స్థితినో, ఒక్క వాతావరణాన్నో చిత్రించటం జరుగుతోంది, స్కెచ్ కథానికా లక్షణాలకు భిన్నంగా వుండదు. అయితే కథానికకి, స్కెచ్‌కి తేడా వున్న భావం మాత్రం కలుగుతుంది.

కథానిక లక్షణంగా ప్రత్యేకంగా గుర్తించలేకపోయినా చమత్కారమైన విషయాన్ని సంక్షిప్తంగా చెప్పేందుకు కార్డు కథ అనేది వుంది. ఇది మినీ కథ లాటిదే. ఈ కథ రూపంలో చాలా తక్కువ పరిధిని పెట్టబట్టి, కార్డు సైజు పరిమాణంలో రాయటం అనేది ఎంత కష్టమో తెలుస్తుంది. చిత్రగుప్త పత్రికలో 1940, 50 మధ్యకాలంలో ఈ కార్డు కథలు వచ్చేవని తెలుస్తుంది.

రేడియో కథ విశేషమైంది. దీనికి పాఠకు లుండరు. శ్రోతలే వుంటారు కనక కథకుని బాధ్యత చాలా ఎక్కువ. ఈ కథకి శ్రవణయోగ్యత ముఖ్యం. ఉచ్చారణ, ఊనిక, స్వరం మొదలైన వాటిపైనే ఎక్కువ బాధ్యత వహిస్తూ, కథలో శిల్పం పోకుండా శ్రోతని మెప్పించగలగాలి. వాటికి కాలపరిమితి ముఖ్యం. ఐదునుంచి పదిహేను నిమిషాల వరకు ఉంటుంది. ఆకాశవాణి ద్వారా 'కథక సమ్మేళనం' అనేది 1962 లో ఏర్పాటయినపుడు వాకాటి పాండురంగా రావు గారు, వాసిరెడ్డి సీతాదేవిగారు, నాయని కృష్ణకుమారి గారు, పోరంకి

పూర్వ కాలంనాటి ప్రచార సాధనాలకూ, నేటి కాలపు సాధనాలకూ మరొక ముఖ్య భేదమున్నది. ప్రాచీన ప్రచార సాధనాల వద్దకు తరచుగా ప్రజలే వెళ్ళి తెలిసికోవలసి ఉండెడిది. కాని, నేటి ప్రచార సాధనాలు ప్రజల వద్దకు వెళ్తున్నాయి. ఒక్కొక్కప్పుడవి విశ్వరూపం ధరించి ఇంటింటా వెలుస్తున్నాయి. కుటుంబ సభ్యులతో విడదీయరాని అనుబంధాన్ని పెంచుకుంటు న్నాయి. ప్రచార ప్రక్రియ నేడు ప్రజల దైనందిన వ్యవహారాల్లో ప్రబలమైన శక్తిగా రూపొందింది. మనిషిజీవితాన్నది నియంత్రిస్తున్నది. ఆధునిక యాంత్రిక నాగరకతా వైభవాన్నీ, సమకాలిక సమాజ జీవన సరళినీ ఈ ప్రచార సాధనాలు మన కనులముందు రూపు కట్టిస్తున్నాయి. ఒక్క లిప్తకాలంలో ప్రపంచాన్నంతా చాపచుట్టగా చుట్టి జానెడు తెరపైకి కుదించి చూపిస్తున్నాయి. మనిషి లేచింది మొదలు మళ్ళీ పడకమీదికి వెళ్లేదాకా ఈ ప్రచార ప్రభావం నుండి తప్పించుకోలేకపోతున్నాడు. నేటి మనిషి జీవితాన్ని శాసిస్తున్నది ప్రభుత్వ శాసనం కన్నా ప్రచార ప్రక్రియే అనడం అత్యుక్తి కాదు. ప్రచార సాధనాలు నేడు కేవలం సమాచారాన్ని మాత్రమే కాక విజ్ఞాన వినోదాల్నీ అందజేస్తున్నాయి.

రాచరికపు రోజుల్లో కంటే ప్రజాస్వామ్య యుగంలోనే ప్రచార సాధనాల అవసరం బాగా ఉంటుంది. ప్రజాస్వామ్యం ఆరోగ్యకరంగా విజయవంతంగా పనిచేయాలంటే ప్రచార వ్యవస్థ సమర్థవంతంగా ఉండాలి. మారుతున్న ప్రజా జీవన మార్గాలకూ, అభిరుచులకూ, ఆదర్శాలకూ, విలువలకూ అనుగుణంగా ప్రచార వ్యవస్థ తన్ను తాను మార్చుకుంటూ ప్రజల జీవన శైలిని అత్యున్న తంగా తీర్చే ప్రయత్నం చేస్తుంది. చేయాలి కూడ. రాచరికపు వ్యవస్థలో ప్రజలకూ ప్రభుత్వాలకూ సన్నిహిత సంబంధాలంతగా ఉండవు. ప్రజలు ప్రభు త్వంలో భాగస్వాములయ్యే అవకాశం చాలా తక్కువ. ప్రభుత్వ కార్యక్రమాలు గానీ, విధానాలుగానీ ప్రజలకు తెలియపరచే బాధ్యత ఆ ప్రభుత్వాలు స్వీక రించవు. రాచరికంలోని ప్రభుత్వాలు ప్రజా సంక్షేమ కార్యక్రమాల్ని విస్తృ తంగా చేపట్టే అవకాశం కూడ తక్కువే. అందువల్ల రాచరికపు వ్యవస్థలో ప్రచార సాధనాల వాడకం అంతగా ఉండదు. కాని, ప్రజాస్వామ్య వ్యవస్థలో అలా కాదు. అందుకు పూర్తిగా భిన్నంగా ఉంటుంది. ప్రజా సంక్షేమ కార్య క్రమాల్ని ఎప్పటికప్పుడు విస్తృతంగా రూపొందిస్తూ ప్రజలకు తెలియపరచ

వలసిన బాధ్యత ప్రజా ప్రభుత్వాలపై ఉంటుంది. ప్రజాభీష్టంలేని కార్యక్రమాలు ప్రజా ప్రభుత్వాలు చేపట్టడానికి వీలులేదు. ప్రభుత్వ విధానాలను ప్రజలకు తెలియ పరచడమేకాక ప్రజల అభీష్టాలనూ, మనోభావాలనూ తెలిసికోవలసిన బాధ్యత ప్రజా ప్రభుత్వాలది. ఇక్కడ ప్రజలే ప్రభుత్వం. ప్రభుత్వమే ప్రజలు. ఎన్ని కలలో ప్రచార సాధనాల అవసరం మరీ ఎక్కువ. ఆయా రాజకీయ పార్టీలు తమ తమ విధానాలను ప్రకటించుకొని ఓట్లకోసం ప్రజలవద్దకు పోతాయి. అవి ప్రచార సాధనాలను విరివిగా ఉపయోగించుకుంటాయి. ప్రజాస్వామ్యయుగంలో ప్రచారమన్నది పరమ పవిత్రమైన ధర్మకార్యంగా గుర్తించాలి. కొన్ని నైతిక సూత్రాలను పాటించాలి. ఎక్కడైనా ఒక అబద్ధంకానీ, పొరపాటుకానీ, అవాస్తవ మైన వార్తకానీ తెలిసో తెలియకో దొర్లిందంటే దానివల్ల లక్షలాది అమాయక ప్రజలు బలవుతారని గుర్తించాలి.

ఈ కాలంలో వాడకంలో ఉన్న ప్రధాన ప్రచార సాధనాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి—

1. ఆకాశవాణి
2. దూరదర్శన్
3. సినిమాలు
4. పత్రికలు
5. ప్రదర్శన కళారూపాలు

వీటిలో మొదటి రెండు అంటే - ఆకాశవాణి, దూరదర్శన్‌లు ప్రభుత్వ యాజమాన్యంలో పని చేస్తున్నాయి. వీటికి స్వతంత్ర ప్రతిపత్తిని కలిగించే ఆలోచన ఆలోచనగానే ఉండిపోయింది తప్ప అది క్రియా రూపం ధరించలేదు. ఇందులో ఒకటి వినిపించడం ద్వారా, మరొకటి వినిపిస్తూ కనిపించడం ద్వారా ప్రజలకు సమాచారంతో పాటు వినోదాన్నీ విజ్ఞానాన్నీ కలిగిస్తున్నాయి. కనుక వినిపిస్తూ కనిపించే ప్రక్రియకు గిరాకీ ఎక్కువ. మూడవదీ నాలుగవదీ అయిన సినిమాలు, పత్రికలు ప్రజల అధీనంలో ఉన్నాయని చెప్పడం పేరుకేగాని అవి పూర్తిగా ధనికుల, పెట్టుబడిదారుల చేతుల్లోని కీలుబొమ్మలుగా పనిచేస్తున్నాయి. వాటి లక్ష్యం ధనార్జన, సొంత ప్రయోజనాల్ని సాధించుకోవడం, ప్రభుత్వ

యంత్రాంగం ముందు బలవత్తరమైన శక్తిగా రూపొందడం. కనుక ఇవి ప్రజల పక్షం ఉన్నట్లే ఉండి తమ స్వార్థ ప్రయోజనాల్ని సాధించుకోవడంలో పరుగులు తీస్తున్నాయి. ఇక చివరిదైన ప్రదర్శన కళారూపాలనే ప్రక్రియ. ఈ కళలు మాత్రమే ప్రజల్లో నుంచి పుట్టి ప్రజల పోషణలో పెరిగి ప్రజల చేతుల్లో ఊపిరి పోసుకుంటున్నాయి. ఇవి ప్రచారానికి బాగా పనికివస్తున్న సాధనాలు. ఐతే ప్రచారం అనేసరికల్లా చాలావరకు ఈ కళారూపాలు మళ్ళీ ఏ ఆకాశవాణి మీదనో లేక ఏ దూరదర్శన్ మీదనో ఆధారపడవలసివస్తున్నది.

ఇప్పుడిక ఆకాశవాణి, దూరదర్శన్‌ల పనితీరు గురించి ఆలోచిద్దాం. ప్రభుత్వ ప్రచార సాధనాలుగా ఈ రెండూ స్థూలంగా ఒకే మూసలో పని చేస్తుంటాయి. ప్రభుత్వం తన వివిధ కార్యక్రమాల ప్రచారానికి బాగా వినియోగించుకుంటున్న సాధనాలీ రెండున్నూ. ఈ కార్యక్రమాలు ముఖ్యంగా మూడు రకాలుగా ఉంటున్నాయి. అవి—

1. సంక్షేమ కార్యక్రమాలు
2. అభివృద్ధి కార్యక్రమాలు
3. ప్రభుత్వ విధానాలకు సంబంధించినవి.

ఇవికాక వార్తల ద్వారానూ ప్రభుత్వ సమాచారం కొంత ప్రజలకు చేరుతున్నది. సాంకేతికపరమైన వ్యత్యాసం వల్ల ప్రచార పద్ధతుల్లో తేడా ఏర్పడుతున్నదే తప్ప ప్రచార సరళిలోగానీ, దాని స్వభావంలోగానీ ఆకాశవాణికి దూరదర్శన్‌కూ పెద్ద తేడా కనిపించదు. ప్రభుత్వం ప్రచారం చేసుకుంటున్న సంక్షేమ కార్యక్రమాల్లో ప్రధాన అంశాలు ఈ విధంగా ఉంటున్నాయి—

1. జనాభా నియంత్రణ
2. వరకట్న నిర్మూలన
3. అక్షరాస్యత
4. పర్యావరణ కాలుష్య నివారణ
5. పొదుపు
6. మాదకద్రవ్యాలపై వ్యతిరేకత
7. బాలికలూ, బాల కార్మికుల పట్ల జరుగుతున్న అన్యాయం
8. ఆరోగ్య సూత్రాలు వగైరా.

ఇంకా ఇలాంటి అంశాల్ని ప్రభుత్వం ఈ రెండు సాధనాల ద్వారా ప్రచారం చేస్తున్నది. ప్రజల్లో వీటి గురించిన స్పృహ కలిగిస్తున్నది. అంతేకాక, ఎప్పటికప్పుడు దేశానికి తారసిల్లే మతకలహాల వంటి దుర్ఘటనల గురించి కూడ ప్రచారం చేసి శాంతిభద్రతల్ని కాపాడే ప్రయత్నం చేస్తున్నది. వీటన్నింటినీ ప్రజలకు తెలియపరచవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అది ప్రజా ప్రభుత్వాల కనీస ధర్మం కూడ. ఐతే, వీటి గురించి మితిమీరిన ప్రచారం జరిగినప్పుడు మాత్రం ప్రజలు విసుక్కోవడం సహజం. అంతేకాక, సమయ సందర్భాలు లేకుండా అదే పనిగా వీటి గురించి ప్రచారం చేయడం అనుచితంగా ఉంటుంది. ప్రజలు దూరదర్శన్ వంటి సెట్లను కొనుక్కోవడం ఈ ప్రచార వస్తువుకోసం కాదు. వినోదంతో కూడిన విజ్ఞానం వాళ్లు ఆశించేది. ఐతే, ఈ సంక్షేమ కార్యక్రమాలు నాటకీకరణ ద్వారా ప్రసారమైనప్పుడు మాత్రం కొంత ఆసక్తికరంగా, ఆకర్షణీయంగా ఉంటున్నాయి.

అభివృద్ధి కార్యక్రమాల గురించి కూడ వీటి ద్వారా తగిన ప్రచారం జరుగుతున్నది. వ్యవసాయం, పరిశ్రమలు, విద్య, వైద్యం వంటి రంగాల్లో పెరుగుతున్న అభివృద్ధి గురించీ, దేశం సాధిస్తున్న ప్రగతి గురించీ, అందుకు ప్రభుత్వం చేస్తున్న కృషి గురించీ ప్రముఖులతో ప్రసంగాలూ, ముఖాముఖి చర్చలూ ఏర్పాటుచేసి, ప్రజల్లో చైతన్యం కలిగిస్తున్నాయి. వాళ్ళను విజ్ఞానవంతులుగా తయారుచేసే ప్రయత్నం జరుగుతున్నది. ముఖ్యంగా వ్యవసాయరంగంలో రైతులు అవలంబించవలసిన నూతనపద్ధతులు, పంటలు నష్టపడకుండా కాపాడుకుంటూ ఎక్కువ దిగుబడికోసం చేపట్టవలసిన చర్యలూ, వివిధ పంచాయతీల ద్వారా జరుగుతున్న సర్వతోముఖ అభివృద్ధి, ఆయా బ్యాంకుల ద్వారా ప్రజలకు అప్పుల రూపంలో అందుతున్న ఆర్థిక సహాయం వంటి అనేక అభివృద్ధి కార్యక్రమాలు ఆకాశవాణి, దూరదర్శన్‌ల ద్వారా విరివిగా ప్రచారమవుతున్నాయి. వీటిద్వారా గ్రామీణ ప్రజలు కొంతలో కొంతైనా లాభపడుతున్నారు. కొంతలో కొంతైనా అని ఎందుకంటున్నానంటే ఇన్ని హంగులుండికూడ, ఇంత ప్రచారం జరిగి కూడ అంగట్లో అన్నీ ఉన్నా, అల్లుని నోట్లో శని అన్నట్లు రాజకీయ ప్రాబల్యంలేనిదే అమాయక ప్రజలకివి లభించడంలేదు. అదైనా కొందరికే,

రాజకీయ నాయకులు తమకు ఎన్నికల్లో పనికివచ్చే వర్గాన్ని మాత్రమే చేరదీస్తారు తప్ప పేదరికాన్ని గణించరు. ఎక్కడైనా చిత్తశుద్ధికల అధికార్లు అర్హతనుబట్టి ఆదుకోవడానికి ముందుకువస్తే-తమ అనుమతిలేనిదే, తమ కరుణాకటాక్షం తొంగిచూడనిదే ఎవ్వరికీ ఏదీ అందజేయరాదని నాయకులు ఆదేశాలిస్తారు. ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే, ప్రభుత్వం చేపడుతున్న కొత్త కొత్త ప్రణాళికలూ, అభివృద్ధి కార్యక్రమాలూ-వీటిగురించి ఎంతగా ప్రచారం జరిగినా, ప్రభుత్వ యంత్రాంగంలోని అనవసరమైన,అనుచితమైన సుడిగుండాలూ, పాము నోట్లో మాత్రమేపడే వైకుంఠపాళీలకారణంగా ఎక్కువ ప్రజలు లాభంపొందలేకపోతున్నారు. లబ్ధిదారుని దరఖాస్తు కిందినుండి పైకి వెళ్ళి మళ్ళీ కిందికి వచ్చేసరికల్లా అతడు కీర్తిశేషుడవుతున్నాడు. ప్రభుత్వం సమకూరుస్తున్న సౌకర్యాలూ, నిధులూ, వాటిని పొందగలిగే మార్గాలూ వంటి పద్ధతుల గురించి కూడా విరివిగా ప్రచారం తిరిగితే ఎక్కువ మంది లాభపడుతారు.

ఇక మూడవదైన ప్రభుత్వ విధానాల సంగతి. నూతన విద్యావిధానం, నూతన ఆర్థిక విధానం, నూతన ప్రజా పంపిణీ విధానం, బడ్జెట్‌లో వడ్డించే కొత్త కొత్త సరికొత్త పన్నులువంటి అనేక విధానాలను ప్రభుత్వం సమర్థించుకుంటూ ప్రచారం సాగించుకుంటుంది. వాటివల్ల ఒనగూడే వినిమయ పరంపరల గూర్చి మేధావులతో ప్రసంగాలు చేయిస్తుంది. ఇటీవల బంగారాన్ని విదేశాల్లో కుదవ బెట్టడం గూర్చి కూడ ప్రభుత్వం తన చర్యను సమర్థించుకుంటూ చక్కగా ప్రచారం చేసుకున్నది. సాంకేతికంగా ఎంతో ప్రగతిని సాధించిన ప్రచార సాధనాలు ఈ రోజుల్లో ప్రతి వార్తను ప్రతి అంశాన్ని ప్రపంచం నలుమూలల దాకా చేరవేస్తున్నాయి. కొన్ని భయంకరమైన వార్తలు దేశాన్ని దావానలంలా చుట్టుముడుతుంటాయి. ప్రపంచంలో ఎక్కడో ఏమూలనో జరిగిన సంఘటన గురించి మరుక్షణంలోనే ప్రపంచ ప్రజలందరూ వినగల్గుతున్నారు. వెంటనే ప్రతిస్పందించగలుగుతున్నారు. ప్రచార సాధనాల సహకారం వల్లనే ప్రజల ఉద్యమాలు విజయవంత మవుతున్నాయి. అవి సహకరించనినాడు నీరుగారుతున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే - ప్రపంచ ప్రజల సాత్వికాదిగుణాల్ని శాసించేవి ప్రచార సాధనాలే అని చెప్పక తప్పదు. వాతావరణ వైపరీత్యాల గురించీ, తుఫాను హెచ్చరికల గూర్చీ ప్రచార సాధనాలు ఎప్పటి కప్పుడు తెలుపుతూ ప్రజల్ని అప్రమత్తం చేస్తున్నాయి. అందువల్లనే ఇటీవల సంభవించిన తుఫాను బీభత్సంలో

వేలాది ప్రజలు ఈ ప్రచార సాధనాల మూలంగానే తమ ప్రాణాల్ని కాపాడుకో గలిగినారు. అంతేకాక, కిడ్నాపుల వ్యవహారాల్లోనూ ప్రచార సాధనాలు అమోఘ మైన పాత్ర వహిస్తున్నాయి. ప్రపంచాన్నంతా ఒక్క క్షణంతో కదిలించగలిగిన మహాశక్తి ప్రచార సాధనాలకున్నది.

ఈ సందర్భంలో ఇక్కడ కొన్ని విషయాల్ని గమనించాలి. ప్రభుత్వాలు మారినప్పుడల్లా విధానాలు మారుతూండడంవల్ల ప్రజలను నిస్సహాయులుగాచేసి అయోమయంలోకి నెట్టడం జరుగుతున్నది. ప్రభుత్వం ప్రకటించే కొన్ని తప్పుడు విధానాల వల్లనూ దేశంలో చిచ్చుపెట్టినంత పని జరుగుతున్నది. అధికార ప్రాబల్యం కోసం, దాన్ని నిలుపుకోవడం కోసం ఏవేవో లేనిపోని ఆశలు కలిపించి దేశాన్ని అడ్డంగా, నిలువునా చీల్చే విధానాలను ప్రచారం చేయడానికి ప్రభుత్వాలు ఈ సాధనాలను దుర్వినియోగపరుస్తుంటాయి. ప్రభుత్వం అమలు పరచే వివిధ కార్యక్రమాలూ, విధానాల గురించి ప్రజ లేమనుకుంటున్నారోనని తెలిసికొని, వాళ్ళ అభిప్రాయాల్ని మదింపుచేసి స్వేచ్ఛగా ప్రకటించే అవకాశం తక్కువగా ఉంటున్నది. ఇక వ్యాపార ప్రకటనలవల్ల ప్రజలకూ, దేశానికి ఎక్కువగా అన్యాయమే జరుగుతున్నదని చెప్పక తప్పదు. ప్రకటనలు ఎక్కువ భాగం ధనికవర్గ ప్రయోజనాల్ని సాధించేవిగా మాత్రమే ఉంటున్నాయి. ప్రకటనలన్నీ "అత్యుత్తమ"మైనవే కనుక వినియోగదారులు గందరగోళంలో మునిగిపోతున్నారు. అల్పాదాయం కలిగిన ఎక్కువమంది ప్రజలకు ఈ నానా రకాల ఆకర్షణలతో కూడిన ప్రకటనలవల్ల నిరాశా నిస్పృహాలే మిగులుతున్నాయి. క్రమంగా దేశీయ సంస్కృతి అంతరించి, మనుషులు "మేడిన్ యూరోపు"లై పోతున్నారు. ముఖ్యంగా ముక్కుపచ్చలారని బాలబాలికలు ఈ కుసంస్కారానికి బలై పోతున్నారు. వాటిని అనుకరించే ప్రయత్నం చేస్తున్నారు. ఈ వ్యాపార సంస్కృతి స్వేచ్ఛాపూరిత వ్యక్తిత్వ వికాసానికి అవరోధం కలిగిస్తున్నది.

ఇక సాహిత్య కార్యక్రమాల గురించి చెప్పవలసి వస్తే. ఆకాశవాణిలో వచ్చే సాహిత్య కార్యక్రమాలకంటె దూరదర్శన్‌లో వచ్చేవి నాసిరకంగా ఉంటున్నాయని ప్రజలు భావిస్తున్నారు. ఆకాశవాణిలో అప్పుడప్పుడు తప్ప సాధారణంగా ఒక స్థాయినుండి దిగజారని కార్యక్రమాలు వస్తుండేవి. కాని దూరదర్శన్‌లో ఎప్పుడో ఒకప్పుడు మాత్రమే ఒక మోస్తరు కార్యక్రమాలు

వస్తుంటాయి. సాహిత్య ప్రసంగాలు కానీ, ఇంటర్వ్యూలు కానీ, కవి సమ్మేళనాలు గానీ ఆసక్తికరంగానే కాదు గౌరవప్రదంగానూ ఉండడంలేదు. కేవలం అధికారుల అభిరుచులూ, అనుబంధాలూ, అనురాగాలూ ఆధారంగా కార్యక్రమాలు రూపొందుతున్నాయి. మంచిని మేము కూడా ఆదరిస్తున్నామని చెప్పుకోవడానికి గాను మచ్చుకు సంవత్సరానికి ఒకటో అరో మంచి కార్యక్రమాల్ని విధిలేక చేపడుతున్నారు.

ప్రచార సాధనాల పని తీరును మదింపుచేసి తగిన సలహాలివ్వడంకోసం ప్రభుత్వం సలహా సంఘాల్ని కూడ నియమిస్తూంటుంది. ఐతే, ఇవి నామమాత్రంగానే ఉంటున్నాయి తప్ప పటిష్ఠంగా పనిచేయడంలేదు. కార్యక్రమాల తీరుతెన్నుల్లో మార్పులు చేర్పులుచేసే అధికారం వాటికి లేదు.అవి ఏవైనా సూచనలు చేస్తే అధికారులు వాటిని విధిగా పాటించాలన్న నియమం లేదు. ఈ దొసగులన్నింటినీ సవరించి, సంస్కరించి, ప్రచార సాధనాలను క్రమబద్ధం చేసిననాడు అవి ప్రజలకు ఇంకా ఎక్కువగా ఉపయోగపడుతాయి. ప్రజాస్వామ్య యుగంలో ఇది తప్పనిసరి.

ఇక ప్రచార సాధనాల్లో మూడవదైన సినిమాల గురించి ప్రస్తావిస్తాను. దీన్ని సినిమా కళ అనడంకంటె సినిమా పరిశ్రమ అనడం సబబుగా ఉంటుంది. ఎందుకంటే, ఈ రోజుల్లో అసాంఘిక ప్రవృత్తిని ఖారీయెత్తున ఉత్పత్తిచేసే పరిశ్రమ సినిమా ఒక్కటే. వీటివల్ల సమాజానికి మేలుకంటే చెడే ఎక్కువగా జరుగుతున్నది. ఇవి మంచిని పెంచడానికి బదులుగా ప్రజలపై కుసంస్కారాన్ని బాగా రుద్దుతున్నాయి. ఎప్పుడో ఒకప్పుడు తప్పిపోయి ఒకటీ అరకంటే మించి మంచి సినీమాలు రావడంలేదు. ఈ సినిమాల చేతుల్లో ప్రజల అభిరుచులు బలవన్మరణం చెందుతున్నాయి. వీటి దుష్ప్రభావం నుండి నేటి యువతీ యువకులూ బాలబాలికలూ తప్పించుకోలేకపోతున్నారు. ఎక్కువ భాగం సినిమాలు బాధ్యతారహితంగా, అశ్లీల దృశ్యాలతో, కంగాలీ డాన్సులతో, అసహ్యకరమైన వాతావరణంతో వెండితెరలపై వీరవిహారం చేస్తున్నాయి. మరి కొన్ని, యువకుల ఉద్రేకాల్ని రెచ్చగొట్టి సొమ్ము చేసుకుంటున్నాయి. చక్కని సందేశాత్మకమైన, సంస్కార విలసితమైన వస్తువును స్వీకరించి నైతికస్థాయిని పెంచే విధంగా, ధర్మబద్ధంగా ఉండడానికి బదులు సినిమాలు వికృతరూపంతో

అవతరిస్తున్నాయి. జాతి జీవన సర్వస్వాన్నీ, దాని అంతరాత్మ స్వరూపాన్నీ, జాతి భిన్న రాగాలనూ, భిన్న కోణాలనూ చిత్రించి సమాజాని కందివ్వగలిగిన అవకాశం, అర్హత, అధికారం, విశాలవేదిక, తగిన హంగులూ - ఇవన్నీ ఉండి కూడా సినిమాలు వాటిని వినియోగించుకోలేక పోతున్నాయి.

ఇక నాలుగవ ప్రచార సాధనమైన పత్రికల గురించి ఆలోచిద్దాం. ఇవి చిరకాలంనుండి ప్రజలకు సమాచారంతోపాటు విజ్ఞాన వినోదాల్ని అందిస్తూ తమ పవిత్ర ధర్మాన్ని నెరవేరుస్తున్నాయి ఒకప్పుడు దేశంలో సాగిన సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమానికీ, స్వాతంత్ర్యోద్యమానికీ పత్రికలే సారథ్యం వహించినా యంటే అత్యుక్తికాదు. వర్తమాన యుగంలోనూ ప్రజా జీవితంలోని ఒక్కొక్క రంగానికి ఒక్కొక్క పత్రిక అంకితమై సేవలందిస్తున్నది. ప్రపంచంలో ఎక్కడైనా ఏదైనా సంఘటన జరిగిన మరుక్షణంలో అది అక్షర రూపం ధరిస్తున్నది. అంతేకాక, విశ్వరూపాన్ని కూడా ధరించి, ప్రపంచమంతా వ్యాపిస్తున్నది. ఆకాశ వాణి. దూరదర్శన్ వంటి సాధనాలు లభ్యపడని ప్రాంతాలకు కూడ ప్రయాణించి పత్రికలు ప్రజల్ని నిత్య చైతన్యమూర్తులుగా తయారు చేస్తున్నవి. ఆకాశవాణి, దూరదర్శన్‌లుకూడా ప్రసారం చేయలేని వార్తలను, విషయాలను సమగ్రంగా, సవివరంగా పత్రికలు ప్రజలకు అందజేస్తున్నాయి. అందుకే ప్రచార సాధనాలన్నింటిలో పత్రికలదే అగ్రతాంబూలం. కనుక,అవి నిష్పక్షపాతంగా వ్యవహరించవలసి ఉంటుంది. నిర్భయంగా రాయవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు సత్యాన్వేషణ జరిపి నిజాన్ని బయటపెట్టవలసి ఉంటుంది. అవి ప్రజల పక్షాన నిలిచే సత్యసంశోధక సంస్థలవంటివని కూడా చెప్పాలి. ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాలకు వీటి సేవ అపారంగా ఉంటున్నది. దేశాన్ని ఎదుర్కొంటున్న క్లిష్ట సందర్భాల్లో ఏది మంచో, ఏది చెడో, ఏది చేయవచ్చునో, ఏది చేయరాదో ప్రజలకు సహేతుకంగా విప్పిచెప్ప వలసిన బాధ్యత పత్రికలపై ఉన్నది. అవి ప్రజలకు మార్గదర్శకం వహించే గురుపీఠం వంటివి. కాని అనేక సందర్భాల్లో పత్రికలు ఆశించినదానికి భిన్నంగా చర్చిస్తున్నాయి. ఇది బాధాకరమైన విషయం. అందుకే ఒకచోట సుప్రసిద్ధ పత్రికా రచయిత స్వర్గీయ శ్రీ తురగా కృష్ణమోహన్‌రావు- "మనకి రాజ్యాంగం ప్రసాదించిన స్వాతంత్ర్యాలలో అతిముఖ్యమైనదని చెప్పదగింది పత్రికా స్వాతంత్ర్యం. ఈ స్వాతంత్ర్యాన్ని మనం లోక కళ్యాణార్థం వినియోగించుకోలేక

పోయామనే చెప్పాలి. చాలా సందర్భాల్లో దీన్ని సద్వినియోగం చేసుకోలేక పోయాం సరికదా, అనేక సందర్భాల్లో దీన్ని దుర్వినియోగం చేయడం కూడా జరిగింది" (తెలుగులో పత్రికారచన-మహతి- యువభారతి ప్రచురణ) అంటూ వాపోవడం జరిగింది.

మరోసంగతి. అప్పుడప్పుడు 'పత్రికా స్వేచ్ఛ' అంటూ పత్రికలవాళ్ల గోల పెట్టడం జరుగుతున్నది. ఈ స్వేచ్ఛ పత్రికల యజమానులకోసమా ? సాంపాదకమండలి కోసమా? విలేఖరుల కోసమా? లేక ప్రజాభిప్రాయ ప్రకటన కోసమా? ఈ ప్రశ్నలు మూడింటిలో చివరిదానికే ప్రాముఖ్యమన్నది వేరే చెప్ప వలసిన పనిలేదు. ఐతే ఈ "పత్రికాస్వేచ్ఛ" అనే హక్కును అనేక సందర్భాల్లో దుర్వినియోగ పరచడం జరుగుతున్నది. ఏదైనా ఒక పత్రికా సంపాదకుడు ఎవరైనా ఒక నాసిరకం రచయితకు ధారావాహిక ప్రచురణలతో ఆకాశాని కెత్తడం ఘోరమైన నేరం. అట్లాగే తమచుట్టూ ప్రదక్షిణలు చేసి మచ్చిక చేసు కోలేని ఉత్తమ రచయితల్ని సైతం పత్రికల దరిదాపుల్లోకి కూడా రానివ్వక పోవడం దేశద్రోహంకన్న మించిన పాపం. మరో ముఖ్య విషయమేమిటంటే- పుస్తక సమీక్షలు కూడ ఒకందుకు కొత్తగా వెలువడుతున్న పుస్తకాల్ని ప్రచారంచేయడానికే ఆద్దేశించింది. ఐతే, వీటివల్ల రచయితలందరికీ సరియైన న్యాయం జరుగటంలేదు. సాధారణంగా ఈ పుస్తక సమీక్షలు వీడు అయినవాడు, వీడు కానివాడు, వీడు అక్కరకు రానివాడు అన్న పద్ధతుల్లో సాగుతున్నాయి. మరికొన్ని పత్రికల ఛత్రచ్ఛాయల్లో కొందరు భాషాభిషక్కులు చేరి యువ రచయితల్ని పెడమార్గంలోకి దింపుతున్నారు. అనారోగ్యకరమైన సాహిత్యం తప్ప వాళ్లు ఉత్తమ సాహిత్యాన్ని యువకులకు పరిచయంచేయడం లేదు మంచి సాహిత్యాన్ని వాళ్లు చదువరు.ఇతరుల్ని చదువనివ్వరు. వీళ్లు తమ చేటు రాతలతో సాహిత్యాన్ని కలుషితం చేస్తున్నారు. ఈలోపాల్ని సరిదిద్దుకోవడం పత్రికలకు పెద్ద సమస్యేమీకాదు. అలాంటి శుభ సమయం త్వరలో వస్తుందని, రావాలని ఆశిద్దాం.

ఇక ఐదవది ప్రదర్శక కళారూపాలు. ప్రదర్శక కళారూపాలలో కొన్ని ప్రసిద్ధమైనవాటిని ప్రభుత్వం ప్రచారసాధనాలుగా వాడుకుంటున్నది. కొన్ని సందర్భాల్లో ఇవి నేరుగా రంగస్థలంపై ప్రదర్శింపబడుతున్నాయి. ఇప్పుడిప్పుడు

వాటిని ప్రచారలక్ష్యంతో దూరదర్శన్ ద్వారా ప్రదర్శించడం ఎక్కువైంది. ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలూ, అభివృద్ధి కార్యక్రమాలూ వీటిద్వారా బాగా ప్రచారం పొందుతున్నాయి ప్రజల నాకర్షించడానికివి బాగా ఉపయోగపడు తున్నాయి. ముఖ్యంగా బుర్రకథ హరికథ, గొల్లసుద్దులు వగైరా కళారూపాల్ని ఈ ప్రచార కార్యక్రమాలకు వాడుతున్నారు. ఐతే, అనేక సందర్భాల్లో ప్రచారం ముఖ్యమై పోయి, ప్రజలకు ఆయాకళాప్రక్రియలపై ఉన్న గౌరవం సన్నగిల్లు తున్నది. కనుక ఈ కళారూపాల ద్వారా కేవలం ప్రచారవస్తువేకాక, ఏ కళా ప్రక్రియ ఎందుకు పుట్టిందో దాన్నే ప్రధాన వస్తువుగా చేసి మధ్యమధ్య వంత గాళ్ళచేత ప్రచార వస్తువు గూర్చిన ప్రస్తావన తేవడం కళకు న్యాయంచేసినట్లవు తుంది. ఒక్కొక్క ప్రదర్శన కళకు ఒక్కొక్క ప్రత్యేకమైన చారిత్రక, సామాజిక నేపథ్యం ఉన్నది. ఆయా ప్రదర్శన కళలు ఆయా సందర్భాల్లో ప్రజల అవసరాల్ని తీర్చడానికి, ప్రజల అభిరుచుల కనుగుణంగా పుట్టి వికసించి నాయి. వాటి నేపథ్యాన్ని చక్కగా అవగాహన చేసుకొని, కళాగౌరవం తరగ కుండా వాటిని ప్రచారంకోసం వాడుకుంటే వాటికి న్యాయం చేసినట్లవుతుంది.

ఇవేకాక మారుతున్న ఈ యుగంలో అగ్గిపెట్టెలు, బస్సులు కూడ ప్రచార సాధనాలుగా పనికి వస్తున్నాయి. ఏదిఏమైనా మారుతున్న ప్రజల అవ సరాలూ, అభిరుచులూ, విలువలకు అనుగుణంగా ప్రచార సాధనాలు మారక తప్పదు. ఐతే, అవి దేశీయ సంస్కృతి పరిరక్షించే విధంగా, జాతీయతను పరి పోషించుకుంటూ ప్రజలకు ఉత్తమ సంస్కారాన్ని అందించే విధంగా ప్రచార సాధనాలు తమ కార్యక్రమాల్ని రూపొందించుకోవడం అవసరం. అవి స్వస్థాన వేషభాషల్ని ప్రదర్శించాలి. స్వాభిమానాన్ని ప్రజ్వలింపజేయాలి.

# మారుతున్న గ్రామీణ సమాజం–జానపద కళారూపాలు

—డా॥ పి. సుబ్బాచారి

మానవ సమాజంలో మార్పు అనివార్యంగా జరుగుతూ ఉండే పరిణామం. 'కొత్త నీరు తొల్కరియేళ్ళ గుమ్మిపార పాతనీరు తొలగు ట్రబమ్ముకాదు' అనే రాయప్రోలు వారి మాట వాఙ్మయానికే కాక అన్ని రంగాలకూ వర్తిస్తూ ఉంది. మనిషి మనిషిలా ఉండలేక పోతున్నాడే కాని అన్ని రంగాలలో దినదినం వికసిస్తూనే ఉన్నాడు. శాస్త్ర విజ్ఞానాది అన్ని రంగాలలో క్షణక్షణం అభివృద్ధి పథంలో ఉన్నాడు. విజ్ఞాన శాస్త్ర ఫలితాలు ఎవరికి ఎందుకు ఉపయోగిస్తున్నాయి, మనిషి మనుగడకు కాకుండా పతనానికి దారితీస్తున్నాయా? అనే విషయాలు ఎకాలజీ మొదలుకొని ఎన్నో రంగాలకు అనుసంధించుకొని ఆలోచించవలసి ఉంది.

విజ్ఞాన శాస్త్ర పురోభివృద్ధి, తద్వారా లభించిన ఆధునిక నాగరికత జీవన విధానాలు, ఆర్థిక రంగంలో వచ్చిన మార్పులు, రాజకీయ రంగంలో పెరుగుతున్న విషతుల్య కాలుష్యం – ఇవన్నీ భారతీయ గ్రామీణ సమాజంలో పెను మార్పులు తీసుకొచ్చాయి గ్రామీణ సమాజం మరీ ఒక ఇరవై ఏండ్ల నుండి విపరీతమైన మార్పులకు లోనయింది. సమాజ శాస్త్రజ్ఞులు గ్రామీణ సమాజంలో కలిగిన మార్పులను మొత్తంమీద చెబుతూ ఉన్నా సాంస్కృతిక సాహిత్యాది భిన్న కళారంగాలలో వచ్చిన, వస్తూ ఉన్న పరిణామాలను ఆయా రంగాలకు చెందిన శాస్త్రజ్ఞులు, విమర్శకులు అంచనా వేసి చెప్పవలసి ఉంది. ఈ దిశగా నడుస్తూ జానపద సంస్కృతిలో - గ్రామీణ సమాజంలో వచ్చిన మార్పుల ప్రభావంతో కలిగిన మార్పులను ఒక రేఖా మాత్రంగా అంచనా వేయడమే ఇక్కడ నేను చేస్తున్న చిన్నపని.

పల్లెటూరు అనగానే ఒకప్పుడు ఒక సుందర దృశ్యం ప్రతివారికీ మనసులో మెదిలేది. ప్రశాంతమైన వాతావరణం. ఆధునిక నాగరికతకు దూరంగా నిసర్గ రమణీయంగా ఉండే సామాజిక జీవితం. చదువులు' లేకున్నా మోసాలు తెలియని 'అమాయక ప్రజలు', కక్షలు కార్పణ్యాలు లేని వ్యక్తులు, నగర జీవితానికి భిన్నమై 'వేగం'లేని మెల్లగా సాగే జీవన గమనం, అనురాగ పూరితమైన వ్యక్తి, కుటుంబ సంబంధాలు, పెండ్లి, పేరంటాలు, ఆటలు పాటలు వినోదాలు.... ఇలా ఒక రమ్యమైన దృశ్యాలను దూరంనుండి ఊహించుకొనే వీలుండేది. అక్కడ ఉన్నవారు అనుభవిస్తూ ఉండేవారు. కానీ, ఈనాటి పల్లెటూళ్లు ఈ చిత్రానికి భిన్నంగా ఉన్నాయి. ఈనాడు ఆలోచిస్తే ఇదంతా పూర్వ వైభవంగా చెప్పవలసి ఉంది.

గ్రామీణ సమాజంలో ఏమి మార్పులు జరిగాయి, దానికి కారణాలు ఏమిటి అని స్థూలంగానైనా చెప్పవలసి ఉంది. విజ్ఞాన శాస్త్రాభివృద్ధి చాలా రంగాలకు పాకి, చాలా మార్పులు తీసుకొచ్చింది.

రవాణా రంగంలో వచ్చిన అభివృద్ధి గ్రామాల స్వరూపాన్ని బాగా మార్చింది. ఏవో కొన్ని గిరిజన ప్రాంతాలు మినహాయిస్తే చాలా గ్రామాలకు రోడ్లు, బస్సు సౌకర్యాలు వచ్చాయి. ప్రతి గ్రామం దగ్గరలో ఉన్న పట్టణానికి అనుసంధించబడి పట్టణ వాతావరణంతో సంబంధం ఏర్పడింది. దీనితో గ్రామీణ వాతావరణం గణనీయంగా మారింది. పాలు, కూరగాయలు మొదలైన వ్యవసాయ ఉత్పత్తులు పట్టణాలకు తీసుకువెళ్ళి విక్రయించుకోవడం ప్రారంభమైంది. దీనివల్ల అప్పటివరకూ గ్రామాల్లో ఉన్న వ్యక్తి సంబంధాలు మారి, అక్కడి వ్యక్తులలోనూ వ్యాపారదృష్టి పెరిగింది. ఈ దృష్టి చాలా విషయాలను ప్రభావితం చేసింది.

పాన్‌షాపులు, సినిమాహాళ్ళు, బ్యాంకులు ఈ రోజు చాలా గ్రామాల్లో కన్పిస్తాయి. దిన పత్రికలు చదివేవారు ఏవో కొన్ని గ్రామాలలో ఎవరో ఒకరిద్దరే ఉండే ఒకప్పటిస్థితి మారి, ప్రతిరోజు ఊరికొచ్చే బస్సు ఎన్నో పత్రికలను, సంగతులనూ మోసుకొస్తూ ఉంది. వార పత్రికలను అద్దెకిచ్చే పాన్ డబ్బాలు ఈ రోజు పల్లెల్లోనూ ఉన్నాయి. గవాస్కర్ చేసే సెంచరీల గురించి

గోడి బిళ్ళాట లాడుకున్న గొడ్లపిల్లవాళ్ళు చర్చించుకుంటున్నారు. ఎన్నికలప్పుడు తప్ప రాజకీయ నాయకులను చూడలేని గ్రామీణులు జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిణామాలను ఏరోజుకారోజు మాట్లాడుకుంటూ ఉన్నారు. పార్టీలు పతాకాలు ముఠాలు కక్షలు కార్పణ్యాలు బాంబుల సంస్కృతులను పెంచాయి.

రేడియోలు, టీవీలు ప్రతి వీధిలో కనిపిస్తాయి. కాన్వెంటు బళ్ళు, మమ్మీ డేడీ సంస్కృతీ ఈనాడు పల్లెల్లోనూ కనిపిస్తుంది. ప్రభుత్వ హస్తగతమైన ఎలక్ట్రానిక్ మాధ్యమం ప్రభావం గ్రామీణ వాతావరణాన్ని బాగా మార్చిలది. పొలం పని చేసుకొని వచ్చి, భోంచేసి ఏ గుడి ముందరో, బొడ్డురాయి దగ్గరో, రచ్చబండల వద్దనో ఉప్పు చెర్రాటలు ఆడుకుంటూ, కోలాటాలు వేసుకొనే దృశ్యాలు కనిపించడం ఈనాడు అపురూపం. ఒక గట్టి ఇంటి ముందు పందిట్లో పెట్టిన టీ. వి. సెట్టు ముందు ఏభై, వంద మంది పెద్దలు, పిన్నలు కూర్చొని టీ. వీ. సీరియల్స్ చూసి, రాత్రి తొమ్మిది పది గంటల సమయం ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళే దృశ్యాలు కనిపిస్తున్నాయి

థియేటర్ల ద్వారానే కాకుండా టీ. వీ ద్వారానూ గ్రామాలకు బాగా చొచ్చుకుపోయిన సినిమా నాటకరంగాన్నేకాక ఎన్నో గ్రామీణ కళారూపాల్ని మరుగున పడవేసింది. ప్రకటనల మిష ద్వారా రేడియో, టి.వీ.లలో ప్రవహిస్తున్న వ్యాపార సంస్కృతి గ్రామీణ ప్రజల మీద బాగా పనిచేస్తూ ఉంది. వేష భాష లలో, వివాహాది ఆచారకాండలలో మార్పురావడానికి పట్టణాల సంపర్గమేకాకుండా రేడియో, టి. వీల ప్రభావం కూడా అధికంగానే ఉంది.

కాలువలద్వారా నీటి పారుదల మెరుగు కావడంవల్ల వ్యాపార పంటలు, వ్యాపార దృక్పథమూ అధికమైనయ్. వ్యవసాయంలో ఇతర గ్రామీణ అవసరా లలో యంత్రాల ప్రభావం వినియోగం అధికం కావడంవల్ల, గ్రామీణ శ్రామిక స్వభావంలో, తత్సంబంధి ఇతర ఆర్థిక సంబంధాలలో మార్పులు వచ్చాయి.

జజ్‌మాని వ్యవస్థ వతన్‌దారీ వ్యవస్థలు ఆశ్రిత వ్యవస్థలు దాదాపు అదృశ్యమయ్యే దశకు వచ్చాయి. ఇందువల్ల వృత్తి సంబంధాలలో చాలా మార్పులు వచ్చి, గ్రామీణ స్వయం సమృద్ధి అనే మాట గతకాలపు మాటయ్యింది

చేతివృత్తులకు సరైన ఆదరణ లభించక ఆయా వృత్తుల వారందరూ నగరాలకు వలసపోవడం వల్ల తత్సంబంధ అవసరాలకు గ్రామాలు తిరిగి నగరాలపైన ఆధారపడవలసి వస్తూ ఉంది. వ్యవసాయం లాభం లేదనుకొని పంట పొలాలు అమ్ముకొని పట్టణాల్లో స్థిరపడేవారు మరికొందరు. నగరీకరణ ప్రభావం నగర జీవితం మీద ఎలా ప్రభావం వేస్తూ ఉందో గ్రామాలపై అంతకు అధికంగా ప్రభావం వేస్తూ ఉంది.

పాఠశాలలు, కళాశాలల సంఖ్య పెరిగి, విద్యావంతుల సంఖ్య సాపేక్షంగా పెరిగింది. ఇంటర్, డిగ్రీ ఇతర చదువులు చదివి, ఉద్యోగాలు రాక తిరిగి గ్రామాలలో వారివారి వృత్తులలో మిగిలిన వారి సంఖ్య సాపేక్షంగా అధికంగానే ఉంది. ఈ కారణంగానూ గ్రామీణ వాతావరణంలో బాగానే మార్పులు చోటు చేసుకున్నాయి.

మరికొన్ని అంశాలు ఈ పరిగణన లోనికి రాకున్నా ఇది ఈనాడు కనిపించే స్థూలమైన గ్రామీణ దృశ్యం.

ఆధునిక నాగరికతలో జానపద విజ్ఞానం అంతరించి పోతూవుంది అనేది ఒకప్పటి మాట. జానపద సంస్కృతి, కళా రూపాలలోనూ కాలంతోపాటు మార్పులు వస్తాయి అనేది ఈనాటి ఆలోచన. ప్రస్తుతానికి ఈ సిద్ధాంత చర్చలు ప్రక్కన పెడితే, గ్రామీణ జీవనంలో వచ్చిన మార్పులు జానపద సంస్కృతి కళారూపాలపై వేసిన ప్రభావాన్ని అంచనా వేయవచ్చు.

జానపద వృత్తి గాయకులను రెండు రకాలుగా చెప్పవచ్చు. ఒకటి నియత ఆశ్రయం ఉన్నవారు. రెండు నియతాశ్రయం లేనివారు. ఒక కులం పేరుతో ఉన్న వృత్తిగాయకులు తమ కళాప్రదర్శనను, కథాగానాన్ని తమ దాతలైన కేవలం మరొక కులంవారికే అందించి ప్రతిఫలం పొందేవారు మొదటివారు. తమ కళను కథను అందరికీ అందించేవారు రెండోరకంవారు.

ఈ రెండు తరహాలవారి కళాప్రదర్శన కథా గానాలలో చాలా మార్పులు వచ్చాయి. మార్పును రెండు విధాలుగా చెప్పవచ్చు. ఒకటి కళలో పరిణామం రావడం. రెండు కళ నామ మాత్రావశిష్టమో అంతరించిపోవడమో జరగడం.

కొన్ని జానపద కళారూపాలు పూర్తిగా కనుమరుగైపోయాయి. గ్రామీణ ప్రజలకు ప్రధాన వినోద సాధనాలైన ఈ కళారూపాలు అంతరించడానికి కారణం ఆదరణ లభించకపోవడం, తద్వారా జీవన భృతులు కోల్పోవడమే. ఈ కళలను ప్రజలు ఆదరించకపోవడానికి కారణం వారికి ప్రత్యామ్నాయ వినోదసాధనాలు లభించడమే. ఈ ప్రత్యామ్నాయ వినోదాలలో ప్రధానమైనది సినిమా; తర్వాత టీ. వీ., రేడియోలు. పద్య నాటకాలు ఈనాటికీ కొన ఊపిరితో బ్రతికి బట్ట కట్టినా జానపద కళలు మాత్రం తెరచాటుకు వెళ్ళవలసి వచ్చింది. వాలకం, వీధి నాటకం, గొల్ల భాగోతాలు, పగటి వేషాలు, భిన్న భిన్న నృత్యాలు ఈనాడు కనిపించవు. యక్షగానం వంటి కళా రూపాలు ఏలినవారు నిర్వహించే వేదికల మీద కనిపించినా అవి జూలో కనిపించే మృగరాజుల్లా తేజోవిహీనంగా నిర్బలంగా ప్రాణాలు కాపాడుకుంటూ కనిపిస్తాయి.

'కాశీకావడివాళ్ళు' కనిపించడమే లేదు. బుడబుడకలు, శారదకాండ్లు, సంక్రాంతి హరిదాసులు, శంఖంపట్టే జంగమయ్యలు ఈనాడు గ్రామాలకు రావడం అపురూపమే. గంగెద్దు మేళాలు కనిపిస్తున్నా కోట్లు పాంట్లు, క్లారినెట్లతో కొత్త వాసనతో కదులుతుంటాయి.

పండరి భజన, బృందావన భజనల్లో మద్దెలలు క్లారినెట్లు హార్మోనియంలు విజాళ్ళు ప్రవేశించి, కొత్త వరుసలు వినిపిస్తూ సినిమా హాయళ్ళపోతున్నాయి. కోలాటం దప్పు నత్యాలలో పాతతీరే లేదు. రంగు రంగుల యూనిఫారాలు వేసుకోవడం, పక్క వాద్యాలు కలుపుకోవడమేకాక, వాటి సహజమైన పద్ధతులు వదిలి సినిమాల్లోలా బారులుతీరుతూ కొత్త నడకలు నేర్చుకొని ఏ పట్టణాల వేదికల మీదనో జాతీయ అంతర్జాతీయ ఉత్సవాలలోనే పాల్గొనడానికి ఉరకలు వేస్తున్నాయి. బహుళ జనాదరణ పొందిన హరికథకే ఆదరణ తగ్గే పరిస్థితి ఏర్పడింది.

ఆశ్రిత కులాలను దాతృ కులాలవారు సరిగా పోషించనందువల్ల వారి సంబంధాలలోనూ మార్పులు వచ్చాయి. వృత్తిలో మిగిలిన వారి సంఖ్య బాగా తగ్గిపోయింది. ఒక ఆశ్రిత గాయక కుటుంబం - అది పిచ్చుకుంట్లో, రుంజలో, పటంవారో గౌడజెట్లో కూనపులివారో ఎవరైనా ఒక గ్రామం వస్తే కనీసం పది రోజులుండి కుల కథలను రోజువారీగా ప్రదర్శించి ఇస్తారు ధాన్యాన్ని తీసుకు

పోతూ నెలల తరబడి పర్యటనలలో ఉండే ఘటనలు ఇప్పుడు లేవు. ఒక్కో గ్రామంలో ఒక్కో ఇంట్లో వారి తంతనులు తీసుకోవడం; గంట, అరగంట కథ చెప్పి వెళ్ళడం చేస్తూ ఉన్నారు.

ఈ మార్పువల్ల కళారూపాలలో పెద్ద మార్పులే వచ్చాయి. రోజుకు ఆరు నుండి ఎనిమిది గంటల చొప్పున పది పన్నెండు రోజులు చెప్పే కథగానాన్ని ఒకటి రెండు రోజులకు, కొన్ని గంటలకు కుదించడం వల్ల కథా నిర్మాణంలో పూర్తి మార్పులు వచ్చాయి. ఎత్తుగడలు, వ్యూహాలు స్వరూపం మార్చుకున్నాయి. ఒగ్గుకథ, పంబకథ, రుంజకథ, పిచ్చుకుంటికథ, పాండవులకథ మొదలైన కథా ప్రదర్శనలన్నింటిలోనూ ఈ మార్పులు వచ్చాయి.

ఇవేకాక, ప్రదర్శనకు సంబంధించిన మార్పులలోనూ ప్రముఖమైనవి చాలా ఉన్నాయి. ఒగ్గుకథలో కొత్తగా ఒక పాత్ర స్త్రీవేషం ధరించడం ఇటీవలి పరిణామమే. పట్టు చీరెలు, కొత్త కొత్త మేకప్ సామగ్రి, రిస్టువాచీలు పెట్టడం, పాంట్లు కోట్లు వేసుకోవడం, సంప్రదాయబద్ధమైన ఆహార్యాన్ని మార్చడం - ఈ మార్పులు పైన చెప్పుకున్న కళారూపాలన్నింటికీ వర్తిస్తాయి.

## జానపద క్రీడలు :

పిల్లలు, పెద్దలు ఆడుకొనే జానపద క్రీడల్లో చాలా క్రీడలు ఈనాడు పేరుకే మిగిలాయి. గ్రామీణ జీవితంలోనూ వేగం పెరగడంవల్ల, ఒక పంటకు బదులు రెండు మూడు పంటలు వేసుకొని - విశ్రాంతితో ఉండే కాలం అటు పిల్లలకు ఇటు పెద్దలకూ లేకపోవడం వల్ల గ్రామీణ క్రీడలు కొన్ని మరుగునపడిపోవడం, మిగిలిపోయినవాటిలో కొన్ని కొన్ని మార్పులు రావడం జరిగింది. గోడి బిళ్ళాట, గోలీలాట, పులిజూదం, దాడి, కొబ్బరికాయ పందాలు, కోడి పందాలు ఇప్పటికీ బాగా ఆడుతూ ఉన్న క్రీడల్లో ఉన్నాయి. జూదం స్వభావం ఉన్న క్రీడలు కొన్ని మిగిలాయి, కొన్ని అంతరించాయి.

ఉప్పుచెర్రాట, దోదోకులబార, కోతికొమ్మచ్చి వంటి చాలా ఆటలు ఇప్పుడు ప్రవర్తించడం లేదు. కొన్ని ప్రాంతాలలో కొన్ని, మరికొన్ని ప్రాంతాలలో మరికొన్ని క్రీడలూ మరుగునపడిపోవడం, మిగిలిపోవడం కనిపిస్తుంది.

జానపద కళారూపాలలో అంతరించినవి అంతరించగా మిగిలినవీ మార్పులకు లోనుకావడం కనిపిస్తూ ఉండగా, జానపద క్రీడల్లో మిగిలిన వాటిలో మార్పులు అంతగా కనిపించవు. నా పరిశీలన మేరకు ప్రవర్తిస్తున్న క్రీడల్లో అనుస్యూత మైన పద్ధతులే మిగిలి ఉన్నాయి.

## జానపద సంస్కృతి (Folk Culture) :

విస్తృతపరిధి ఉన్న రంగం. క్రీడలు, కళలు మొదలైనవి అన్నీ ఇందులో చేరినా ఈ శీర్షికన సాంఘిక జీవితమూ వస్తు సంస్కృతినే ప్రధానంగా పరిగణన లోనికి తీసుకుంటారు. ఈనాటి గ్రామీణ సమాజంలోఆచార కాండలలో వేడుకలలో సమయం, డబ్బు, ఆదునిక నాగరికత కారణాలుగా చాలా పరిణామాలు చోటు చేసుకున్నాయి. ఈ అధ్యయనమంతా అతి విస్తృతమైన నేపథ్యంతో సాగవలసి-ఉంది. సమాజ శాస్త్రజ్ఞులు కొంతవరకు ఈ పని చేస్తూనే ఉన్నారు. ఆయా సంద ర్భాలను పురస్కరించుకొని ఉత్పన్నమయ్యే జానపద గేయ సాహిత్యంలోనూ ఈ మార్పుల ప్రభావం కనిపిస్తూ ఉంది. సామెతలు, పొడుపు కథలు వీటికి బాహ్యంగా ఏమీలేవు.

## అనువర్తిత జానపదవిజ్ఞానం (Applied folklore) :

జానపద సాహిత్యాన్ని, కళా రూపాల్ని రాజకీయ పార్టీలు, భిన్న సంస్థలు చాలా కాలంగా ఉపయోగించుకుంటునే ఉన్నాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంలో భిన్న ఉద్యమాలలో వారి వారి లక్ష్యాల ప్రచారాలకు జానపదగేయాల బాణీలను, జముకుల కథ, బుర్రకథ వంటి కళా రూపాలను రాజకీయ పార్టీలు బాగా వినియోగించుకున్నాయి. సంప్రదాయక కళారూపం, నూతన వస్తువుల సమ్మేళ నంతో ఒక కొత్త తరహా ప్రక్రియలే ఆవిర్భవించాయి నిన్న మొన్నటి శ్రీకాకుళ ఉద్యమం, ఈనాటి రాడికల్స్, నక్సల్స్ జానపద కళలను ఈ తరహాలోనే వినియోగించుకుంటున్నారు.

ఒక పదేండ్లుగా ఎన్నికల్లో రాజకీయ పార్టీల ప్రచార ధోరణులు బాగా మారిపోయాయి. పార్టీలు ఎలక్ట్రానిక్ మాధ్యమాన్ని విరివిగా వినియోగించు కుంటున్నాయి. ఈ మాధ్యమంలో ప్రధాన విషయ ప్రసారవాహకం జానపద

సాహిత్యమే, బాణీలే. వివిధ వ్యాపార సంస్థలు, ప్రభుత్వ సంస్థలు తమ లక్ష్య ప్రసారానికి ఈనాడు ప్రధానంగా ఆధారపడేది జానపద కళలపైనే కుటుంబ నియంత్రణ, వయోజన విద్య మొదలైన అన్ని కార్యక్రమాల ప్రచారానికి రేడియో, టి.వీలు, కళా ప్రదర్శక బృందాలు ఆధారపడింది జానపద కళా రూపాలపైననే.

ఈ అన్ని సందర్భాలలో ఆధునిక అవసరాలకు అనుగుణంగా జానపద కళలు రూపాంతరం చెంది ఉపయోగపడ్డాయి. ఈ కళారూపాలు పూర్తిగా జానపద కళలు అని చెప్పడానికి వీలుపడేవి కావు. అలా అని అసలు జానపద విజ్ఞాన సంబంధివే కావు అని అనడానికి వీలులేదు. ఈ విధంగా జానపద కళలు ఇతర రంగాలలో వినియోగపడిన వాటిని అన్నింటిని సామూహికంగా **Applied folklore** అని పాశ్చాత్య జానపద విజ్ఞాన పండితులు వ్యవహరిస్తూ ఉన్నారు. మనం దీన్ని 'అనువర్తిత జానపద విజ్ఞానం' అని వ్యవహరించవచ్చు. జానపద విజ్ఞానం భిన్న లక్ష్యాల ప్రచారానికి ఎలా వినియోగిస్తూంది, ఆయా సందర్భాలలో జరిగే పరిణామా లేమిటి అనే ప్రధాన ప్రశ్నలను భిన్నస్థాయిలలో ఆలోచించి లోతుగా అధ్యయనం చేయవలసి ఉంది. ఈ శాఖ మొత్తాన్ని అనువర్తిత జానపద విజ్ఞాన శాఖగా గుర్తించి ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది.

## రేడియో, టి.వి :

ఈ అనువర్తిత జానపద విజ్ఞానం కాక రేడియో, టి.వి. వారు భిన్న జానపదగేయాలను, కళారూపాలను 'ఆదరించి' ప్రచారం చేస్తూ ఉన్నారు. వీరికున్న కాలపరిమితి, అక్కడి ఉద్యోగుల అభిరుచి. హస్తక్షేపాల కారణంగా వారు ప్రసారం చేసే అసలు జానపద కళారూపాలుకూడా అసలవి కాని పద్ధతిలో బాగా వికృతికి (**Distortion**) గురై ప్రసారం అవుతున్నాయి. ఒగ్గుకథవంటి సంప్రదాయ కళారూపాలలో నెహ్రూ కథ, ఇందిరమ్మ కథలు వస్తున్నాయి. ఒక కళారూపానికి చెందిన సంప్రదాయ కథలు మరొక కళారూపానికి చెందిన సంప్రదాయంలో ప్రవేశిస్తూ ఉన్నాయి. కృత్రిమమైన సాఫిస్టికేషన్‌కు గురవుతున్నాయి. వీటన్నింటినీ కొట్టివేయకుండా అధ్యయనం చేయవలసే ఉంది.

రేడియో, టీ.వీ.లలో ప్రసారమయ్యే కళారూపాలను గ్రామాలలో ప్రదర్శిస్తూ ఉన్న జానపద కళాకారులు కూడా అనుకరిస్తూ ఉండటంవల్ల వీటి ప్రభావం పరోక్షంగానూ అధికంగా ఉంటూ ఉంది. అవన్నీ అధ్యయనం చేయదగిన అంశాలే.

మారుతున్న గ్రామీణ సమాజంలో జానపద విజ్ఞానం పొందుతున్న మార్పులను ఇక్కడ ఒక రేఖామాత్రంగానే స్పృశించడానికి వీలుపడింది. నిజా నికి వీనిలో ఒక్కొక్క అంశం విపులంగా పరిశోధించదగిన విస్తృతపరిధి కలిగి ఉన్నవే.

# నేటి సాహిత్య సంస్థలు - తీరుతెన్నులు

—డా॥ మసన చెన్నప్ప

ఈరోజు ఏ పత్రిక తిరిగేసినా ఏదో ఒక సాహిత్య సంస్థ అధ్వర్యంలో జరిగిన కార్యక్రమ విశేషాలో లేదా ఒక కొత్త సంస్థ ప్రారంభింపబడ్డ సమాచారమో ఉండటం సహజం. నాటి నేటి సాహిత్య సంస్థలకు మధ్య వున్న భేదాన్ని గూర్చి ఆలోచించినప్పుడు పూర్వం సాహిత్య సంస్థలు ఆర్థిక బలం, అంగబలం కలిగినవిగా కనిపిస్తాయి. ఇక ఈనాటి సంస్థలకు ఆర్థిక బలం, అంగబలం తక్కువే. కార్యక్రమాన్ని బట్టి ఆర్థికబలాన్ని, అంగబలాన్ని సమీకరించుకోవడం సాహిత్య సంస్థలకు నేడు పరిపాటి అయ్యింది. కొన్ని సంస్థలు మాత్రం తాము జరిపే కార్యక్రమాల ద్వారానే కొంత డబ్బును పోగు చేసుకోవడం, ప్రచారాన్ని పొందడం కూడా చూస్తున్నాం.

అసలు సాహిత్య సంస్థలు ఎందుకన్న ప్రశ్న ఉదయిస్తుంది. ఒకరిచేతగాని సాహిత్యాభిరుచి కల్గిన పలువురిచేతగాని సంస్థలు స్థాపించబడి, సాంఘిక ప్రయోజనం కల్గిన రచనలను ప్రచురించడం ద్వారాను, ఉత్తమ సాహిత్యాన్ని ప్రచారం చేయడం ద్వారాను తమ అస్తిత్వాన్ని నిలుపుకొంటున్నాయి. రచయితల్లో సృజనాత్మకతకు తోడ్పడుతూ, సంప్రదాయ సాహిత్యంలోని విలువల్ని పరిరక్షిస్తూ, ప్రజల్లో ఉత్తమ సాహిత్యాభిరుచిని పెంచుతూ, ఎప్పటికప్పుడు సాహిత్యరంగంలో వస్తున్న మార్పులను గుర్తిస్తూ తదనుగుణంగా యువకులను ప్రోత్సహిస్తూ కార్యక్రమాలను నిర్వహించేవే నిజమైన సంస్థలు. ఉదా : నవ్యసాహిత్య పరిషత్తు మొదలైనవి.

ఈనాడు ప్రతి మండల స్థాయిలోను ఏదో ఒక పేరుతో స్వతంత్రంగానో లేదా అనుబంధంగానో సాహిత్య సంస్థలున్నాయి. ఇక నగరాల మాట చెప్ప

నక్కరలేదు. ఉదాహరణకు మన జంట నగరాల్లో సుమారు ఒక వంద సాహిత్య సంస్థలున్నాయంటే ఆశ్చర్యపోనక్కరలేదు. సాహిత్య సంస్థలు అనేక రకాలున్నాయి. ఒకటి- ఆయా కవుల పేరు మీదున్న సంస్థలు, (శ్రీనాథ పీఠం, ఎర్రన పీఠం). రెండు- ఆయా సిద్ధాంతాలకు అనుగుణంగా కొందరు మిత్రులు కలిసి ఏర్పడిన సంఘాలు, భిన్న సాహిత్య రుచులు కల్గిన ప్రజల్ని దృష్టిలో పెట్టుకొని ఏర్పడిన సంస్థలు, కేవలం సాహిత్యాభిమానులు నెలకొల్పిన సంస్థలు, ప్రాచీన సాహిత్యాన్నో లేదా ఆధునిక సాహిత్యాన్నో దృష్టిలో పెట్టుకొని ఏర్పడ్డ సంస్థలు, సాహిత్యంతో సంబంధం లేని వ్యక్తులు స్థాపించిన సంస్థలు.

ప్రజల్లో చదవదగిన సాహిత్యం మీద అభిరుచిని, ఆసక్తిని రేకెత్తించి సాహిత్యానికీ, సామాన్య పాఠకునికీ మధ్య వారధిగా ఉండే సాహిత్య సంస్థలే ఉత్తమమైనవి. కాని, చాలా సంస్థలు పేరుకే తప్ప ఆచరణలో నిర్దేశించిన లక్ష్యాన్ని చేరుకోలేక పోతున్నాయి. ఒక కళాకారుడిని లోకానికి పరిచయం చేయాలన్నా, ఒక ఉత్తమ గ్రంథం ఆవిష్కృతం కావాలన్నా ఆ కళాకారుడో లేదా ఆ గ్రంథకర్తో పరోక్షంగా సంస్థకు డబ్బు ఇచ్చుకోవల్సిన దుర్దశ ఈనాడు దాపురించింది. ఆయా కళల్లో ఉన్నత శిఖరాలను అధిరోహించిన వ్యక్తులను సన్మానించడానికి లేదా ఉత్తమ గ్రంథాలకు ఆవిష్కరణ సభలు ఏర్పాటు చేయడానికి స్వచ్ఛందంగా సంస్థలు ముందుకు రాకపోవడానికి కారణం ఆర్థిక వనరులు కొరవడటమే. అదృష్టం కొద్దీ ఎవరో ఒక దాత దయతలచి కార్యక్రమాన్ని 'స్పాన్సర్' చెయ్యాలి. ఆ స్పాన్సర్ చేసే వ్యక్తికి సాహిత్యంతో సంబంధం లేకపోయినా అతన్ని మాత్రం సభలో అధ్యక్ష స్థానంలోనో, ముఖ్య అతిథి స్థానంలోనో ఆసీనుణ్ణి చెయ్యాలి. విధిలేక అతనిచేత తొలిపలుకులో, మలి పలుకులో చెప్పించి, సభాసదుల్ని సభకు వచ్చినందుకు తమను తాము దూషించుకునేలా చేయడం కొన్ని సాహిత్య సంస్థలకు తప్పదుమరి.

కొన్ని సంస్థలు ఆయా సిద్ధాంతాలకు కట్టుబడి తత్సంబంధమైన వ్యక్తులనే వేదికలమీది కెక్కించి కార్యక్రమాలను నిర్వహించడం జరుగుతుంది. అందుకే అలాంటి సాహిత్య సంస్థలు నిర్వహించే సభల్లో ఎప్పుడు చూసినా ఒకేరకం జనం కనిపిస్తుంది.

చాలా సంస్థలకు స్వంత భవనాలు లేవు. అద్దె భవనాలు కూడా తక్కువే. అధ్యక్షుని ఇల్లో, కార్యదర్శి ఇల్లో సాహిత్య సంస్థకు నిలయం. ఇక సభా కార్యక్రమాలు నిర్వహించటానికి చిన్న చిన్న సాహిత్య సంస్థలు వేదికలను ఎప్పుడూ వెదుక్కోవల్సిందే. తమ ఆర్థికస్తోమతనుబట్టి, వచ్చే ప్రేక్షక జనాన్నిబట్టి సభావేదికలను ఎన్నుకోవడం జరుగుతుంది. ఉదాహరణకు భాషా నిలయం గొప్పగా సభను నిర్వహించడానికి వేదిక కాకపోయినప్పటికి గ్రంథాలయానికి వచ్చేజనం అనుకోకుండా కార్యక్రమాలకు ప్రేక్షకజనంగా మారడం ఒక సదుపాయం. కాబట్టి కొన్ని సాహిత్య సంస్థలు ఇక్కడ సభలు నిర్వహించుకోవాలని చూస్తాయి. 'సిటీ సెంట్రల్ లైబ్రరీ' జంటనగరాల్లో అన్ని సాహిత్య సంస్థలకు అందుబాటులో ఉన్న వేదిక. అద్దె తక్కువ. ప్రేక్షకులు అధిక సంఖ్యలోనే వస్తారు. కాని! అదే సమయంలో త్యాగరాయ గానసభలో ఏ నృత్య కార్యక్రమమో లేకపోయినట్లైతేనే, 'ఆంధ్ర సారస్వత పరిషత్తు' గొప్ప సాహిత్య సంస్థేకాక గొప్ప సాహిత్య సభావేదిక. ఈ సంస్థ సభావేదికగా వన్నెకెక్కడానికి ఇక్కడ నిర్వహింపబడుతున్న 'యువభారతి' సాహిత్య కార్యక్రమాలే కారణం. చాలా సాహిత్య సంస్థలు రవీంద్రభారతి దరిదాపులకు కూడా వెళ్ళవు. కారణం ఆర్థికవనరులు లేకపోవడం.

కొన్ని సాహిత్య సంస్థల నిర్వహణ లోపం వల్ల సభావేదికలు పేలవంగా ఉండడం చూస్తాం. సభలో పట్టుమని పదిమంది ఉండరు. మీదుగా అధ్యక్షుడు ఆలస్యంగా రావడం. ముఖ్య అతిథి ప్రసంగానికి ముందే కరెంటుకోత. పత్రికల వాళ్ళ జాడే కన్పించదు. ఒకవేళ హాలు దొరికి, అద్దె తక్కువై, కరెంటు పోకుండా ఉండి, జనం నిండి. పత్రికలవాళ్ళు వచ్చి కార్యక్రమం విజయవంతం అయితే అది ఆ సాహిత్య సంస్థ అదృష్టమనే చెప్పాలి.

పాఠకులకు అభిమాన రచయితలున్నట్లే, ప్రేక్షులకు అభిమాన నటులున్నట్లే, సాహిత్యప్రియులకు ఆయా సంస్థల మీద అభిమానము, గౌరవము ఉండడం కద్దు. ఏదేమైనప్పటికి పెళ్ళికి శుభలేఖలు పంపినట్లు సాహిత్య కార్యక్రమాలకు ఆహ్వానాలు అందించవలసిన అవసరం ఏర్పడింది ఈనాడు. స్వయంగా ఆహ్వానా లందిస్తేనే సభలకు వచ్చే సహృదయ సాహితీ మిత్రులున్నారు. అంతేకాని, కేవలం పత్రికల్లో 'నగరంలో ఈనాడు' శీర్షికన మొక్కు-

బడిగా కార్యక్రమ సమాచారాన్ని ప్రచురించినంత మాత్రాన సరిపోదు. ముఖ్యంగా ఆయా సంస్థలవారు పత్రికలవారితోను, విలేఖరులతోను, ప్రేక్షక జనంతోను మచ్చికగల్గి ఉండాలి. లేకపోతే సభలోఉన్నవాళ్ళకంటే, వేదిక మీద ఉన్న వాళ్ళ సంఖ్యే ఎక్కువౌతుంది. అయినా ఫరవాలేదు. ఒక్కొకసారి స్పెషల్ ఫోటో తీయించి అప్పటికప్పుడు కడిగించి పత్రికలవాళ్ళకు ఆఘమేఘాల మీద అందిస్తే మర్నాటి పత్రికలో ఆ కార్యక్రమం తాలుకు విషయం ప్రచురితమయ్యే అవకాశం లేకపోలేదు.

నిజానికి ఈనాటి సాహిత్య సంస్థలు జరిపే కార్యక్రమాల్లో వెరైటీ లేకుండా పోయింది. సాహిత్య సప్తాహాలు నిర్వహించిన సాహిత్య సంస్థలు కనిపించవు. ఏ యువభారతి వంటి సంస్థలో ఇందుకు సాహసించవల్సిందే. రెండేళ్ళ క్రితం అనుకుంటాను రవీంద్రభారతిలో రసమయివారు మేడసాని మోహన్ శతావధాన కార్యక్రమాన్ని రెండురోజులు నిర్విఘ్నంగా నిర్వహించారు. సాహిత్యాన్ని అభిమానించే జనులున్నంత కాలం సాహిత్య సంస్థలకు ఢోకాలేదు. కాని, రచయితల్లో సృజనాత్మకతను పెంచడంతో పాటు ప్రాచీనాధునిక భేదం లేకుండా ఉత్తమ సాహిత్యాన్ని ప్రచారం చేసే వేదికలుగా నిలిచి వ్యక్తుల లాభం కంటే సామాజిక ప్రయోజనమే లక్ష్యంగా పెట్టుకొని సాహిత్య సంస్థలు ముందుకు సాగాల్సిన అవసరం ఎంతైనా వుంది.

అర్థబలం, అంగబలం రాజకీయ పార్టీలకు లాగానే సాహిత్య సంస్థలకు అవసరం. కాని, రాజకీయాలకు కొమ్ముకాయడం మాత్రం సాహిత్య సంస్థల ధ్యేయం కారాదు. సాధారణంగా సాహిత్య సంస్థలకు కార్యవర్గం అని ఒకటుంటుంది. కార్యక్రమాలన్నీ కార్యవర్గ సభ్యులందరి ఏకాభిప్రాయంతో రూపొందింపబడడం సందేహాస్పదమే. అధ్యక్షుడో, కార్యదర్శో ప్రముఖ పాత్ర వహించడం కద్దు. కోశాధికారి ఉంటాడు కాని అతనికి సంస్థల ఆదాయవ్యయాలకు సంబంధమే ఉండదు. ఇక కార్యవర్గంలో కొంతమంది విలక్షణమైన వ్యక్తులుంటారు. వారు కార్యవర్గ సమావేశానికి రారు కాని కార్యక్రమం అవుతుంటే వస్తారు. స్వాగతం చెప్పి వెళ్ళిపోయే సభ్యులు, ధన్యవాదాలు చెప్పే సమయానికి మాత్రమే వచ్చే సభ్యులు లేకపోలేదు.

చాలా సంస్థలు సాహిత్య సాంస్కృతిక సంస్థలుగా కన్పిస్తాయి. కాని అవి కేవలం సాహిత్య కార్యక్రమాలకే పరిమితమై ఉన్నాయి. సాహిత్యేతరమైన నృత్యం, సంగీతం, నాటకం ఇత్యాది కళల్ని అంతగా ప్రచారం చేసిన జాడ కనిపించదు. కొన్ని సంస్థలు కేవలం పుస్తకావిష్కరణలకే పరిమితం.మరికొన్ని కవుల జయంతులకు పరిమితం కాగా ఇంకొన్ని వర్ధంతి సభలను జరుపుతున్నాయి. స్మారకోపన్యాసాలకే కాక సన్మాన సభలకు పరిమితమైన సంస్థలూ ఉన్నాయి. కొన్ని సంస్థలు ఉగాది, దీపావళి, దసరా,సంక్రాంతి ఇత్యాది సమయాల్లో విధిగా కవి సమ్మేళనాలు నిర్వహిస్తాయి. ఈ కవి సమ్మేళనాల గురించి ఒక మాట చెప్పాలి. కొన్ని కొన్ని సందర్భాల్లో కవుల సంఖ్య ఎక్కువ కావడం, ప్రేక్షకుల సంఖ్య తక్కువగా ఉండడం జరుగుతుంది. అంతేకాక,కవిసమ్మేళనాల్లో కవిత్వం కంటె ఎక్కువ సమయాన్ని ఉపన్యాసాలకు కేటాయించడం ఎంత అనౌచిత్యమో చెప్పలేం. కొన్ని సాహిత్య సంస్థలు చక్కగా సదస్సుల్ని నిర్వహిస్తూ, పండితులచే ఉపన్యాస కార్యక్రమాలు కొనసాగిస్తూ ఆయా సాహిత్య ప్రక్రియలపై అమూల్యమైన విమర్శన గ్రంథాలు వెలువరిస్తున్నాయి. ఇందుకు ఉదాహరణగా ఇటీవలి కాలంలో పేర్కొనదగిన సంస్థ "యువభారతి."

సాహిత్య సంస్థలు నడిపేవారికి కొన్ని సౌకర్యాలుండాలి. ఆర్థికంగా ఎన్ని ఇబ్బందులున్నా కార్యక్రమ నిర్వాహకుడికి ఎక్కడికైనా వెళ్ళడానికి స్కూటరుండాలి. లేదా బస్టాండుకు దగ్గరగా ఇల్లైనా ఉండాలి. ఇంట్లో ఫోనుండాలి. ఇంటికి దగ్గర్లో ప్రెస్సుండాలి. పోస్టాఫీసు కూడా సమీపంలో ఉంటే మరీ మంచిది. ప్రూఫులు దిద్దడానికి, ఇన్విటేషన్ల మీద గుండ్రని అక్షరాల్లో చిరునామాలు వ్రాసే సహాయకులు ఉండాలి. బ్యాంకులో బ్యాలెన్స్ కూడా ఉంటే మంచిది.

ప్రారంభోత్సవానికి మాత్రమే పరిమితమైనవి, విజిటింగ్ కార్డుల మీద మాత్రమే కనిపించేవి, లెటర్ హెడ్‌ల వరకు వచ్చి ఆగిపోయినవి- ఇలాంటి సంస్థల వల్ల సాహిత్యానికి, లోకానికి ప్రయోజనం లేదు. ఆయా సాహిత్య కార్య క్రమాలను నిర్వహించే సంస్థల స్థాయిని అంచనా వేయలేని స్థితిలో లేరు ప్రేక్ష కులు. కొన్ని సంస్థలు ఇష్టే సాహిత్య కార్యక్రమాలు జరిపిపితే తండోపతండా

లుగా జనం వస్తారు. స్వలాభం కంటే సమాజ శ్రేయస్సే ధ్యేయంగా కల్గిన సంస్థలను గుర్తించి ప్రోత్సహించడమే కాక, ఇతోధికంగా ఆర్థిక సహకారాన్ని అందించవలసిన అవసరం అటు ప్రజలకు, ఇటు ప్రభుత్వానికి ఎంతైనా వుంది. అంతేకాని, కేవలం తమ అభ్యుదయానికి తోడ్పడిన వ్యక్తికి సన్మానం చేయడానికో లేక అవార్డు ఇవ్వడానికో స్థాపింపబడిన సంస్థలను ప్రజలు ఎక్కువ కాలం గుర్తుపెట్టుకోవడం కష్టం.

నవ్య సాహిత్య పరిషత్తులాంటి సంస్థలు లేకున్నా సాహిత్య సంస్థలు కూడా ప్రచార సాధనాలే.

మహబూబ్‌నగర్ జిల్లాలో అమన్‌గల్ అనే గ్రామంలో సాహిత్య కార్యక్రమం, కవి సమ్మేళనం జరిగింది. అక్కడ ఒక సంస్థ ఏర్పాటు చేసింది. కవులకు రానుపోను ఖర్చులు ఇచ్చారు. శాలువాలు కప్పారు. భోజనం పెట్టారు. ఐతే, ఆ సాహితీ సంస్థను నడుపుతున్న వారికి గ్రామం అంతా తోడ్పడింది. గ్రామంలో దాతలిచ్చిన విరాళాలతో కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. అర్ధరాత్రి దాకా కవిసమ్మేళనం జరిగింది. సాహిత్య సభలంటే, కవి సమ్మేళనాలంటే ఆయా ప్రాంతాల్లోని ప్రజలకున్న అభిరుచిని తెలియజేయడానికే ఈ విషయం చెప్పాను.

"ఎన్ని సంస్థలైనా ప్రారంభం కావచ్చుకాని నిలదొక్కుకోవడమే కష్టం" అన్న దేవులపల్లి రామానుజరావుగారి మాటల్ని స్మరిస్తూ, "ప్రాచీన వాఙ్మయాన్ని అభిమానిస్తున్నవారినీ, ఆధునిక సాహిత్యాన్ని అభిలషిస్తున్నవారినీ సమంగా సంతృప్తి పరుస్తూ వారిమధ్య సదవగాహననీ, సమన్వయాన్ని ఏర్పర్చటానికి విశేషకృషి చేస్తున్న అసమాన సాహితీ సంస్థ యువభారతి" అన్న అభినవ పోతన వాక్కులతో ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.





# యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణలు

1. **వివేకానందలహరి** (ప్రచురణ సంఖ్య 148)
   శ్రీ స్వామి వివేకానంద చికాగో నగరంలో ప్రపంచ మహా సభలో ఉపన్యసించిన చారిత్రాత్మక సన్నివేశానికీ, స్వామి హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలను సందర్శించిన మరువలేని ఘట్టానికీ శతజయంత్యుత్సవంగా ప్రముఖుల ఉపన్యాసవ్యాసాలతో వెలువరించిన గ్రంథం 'వివేకానంద లహరి.'
2. **కొత్త గొంతుకలు : సరికొత్త విలువలు** (ప్ర. సం. 145)
   యువభారతి రజతోత్సవ సదస్సులోని ఉపన్యాస వ్యాసమంజరి. సమకాలీన సాహిత్యంలో వస్తున్న అత్యంతాధునిక రీతులను, వాటిని ప్రపంచిస్తున్న రచయితల కలాల, గళాల బలాబలాలను గురించిన ఒక అంచనా.
3. **విద్యా వైద్యశాస్త్ర శకారంగాలు : మానవ విలువలు** (ప్ర. సం. 146)
   సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస లనే మానవ మౌలిక మూల్యాలు విద్యా వైద్య శాస్త్ర రంగాలలో ఎలా ప్రతిఫలిస్తున్నాయో సమీక్షించే సహృదయ సమాలోచనం, యువభారతి రజతోత్సవ సదస్సుకు అక్షరకల్పన.
4. **స్త్రీవాద ధోరణులు : సమకాలీన సాహిత్యం** (ప్ర.సం. 147)
   ఆధునిక సమాజంలో, సాహిత్యంలో స్త్రీ అస్తిత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ, పోరాటాన్నీ పరిచయం చేస్తూ అంచనావేసే వ్యాస సంపుటి. యువభారతి రజతోత్సవ సదస్సుకు అక్షరాకృతి.
5. **సాహితీ సమాలోచనం - 1992 & 1993** (ప్ర. సం. 149)
   ప్రతి యేటా వెలువడుతున్న సాహిత్యం మీద, ప్రక్రియల మీద యువ భారతి నిర్వహించే 'సమాలోచనం'లో భాగంగా వెలువడుతున్న వ్యాస మంజరి. నడుస్తున్న సాహిత్య చరిత్రను సమీక్షించే వాఙ్మయ నేత్రం.
6. **ఆధునిక సాహిత్యం : దళిత స్పృహ** (ప్ర.సం. 151)
   యువభారతి ప్రతినెలా మొదటి ఆదివారం నిర్వహించే 'సమాలోచనం'లో భాగంగా సాగిన సాహిత్య గోష్ఠిని అక్షరబద్ధం చేస్తున్న ప్రచురణ. అత్యంతాధునిక స్పృహతో వెలుపడుతున్న దళిత సాహిత్యానికి అందించే ఒక చిరుకానుక.
7. **తెలుగు తమిళ కవితలు : జాతీయవాదం** (ప్ర.సం. 150)
   తెలుగు, తమిళ తులనాత్మక అధ్యయనంలో ప్రసిద్ధిచెందిన ప్రముఖ కవులు, విమర్శకులు డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మగారి పరిశోధనాత్మక రచన.



# యువభారతి సాహిత్యోద్యమాన్ని ప్రోత్సహించండి!

యువభారతి సాహితీమిత్ర, భారతీమిత్ర, భారతీభూషణ పథకాలలో చేరి, మీ మిత్రులనుకూడా అధిక సంఖ్యలో చేర్పించి, యువభారతి సాహిత్యోద్యమానికి చేయూత నివ్వండి.

**'సాహితీ మిత్ర'**

రూ. 100.00 చెల్లించి, రూ. 150.00 విలువగల ప్రచురణలను అందు కొనేవారిని 'సాహితీ మిత్రులుగా' యువభారతి సంభావిస్తుంది.

**'భారతీ మిత్ర'**

రూ. 1000.00 విరాళంగా అందించి, సంవత్సరంపాటు యువభారతి ప్రచురణలను ఉచితంగా పొంది, మా కృతజ్ఞతలకు సదా పాత్రులయ్యే సౌజన్య మూర్తులను 'భారతీమిత్రులు'గా యువభారతి సమ్మానిస్తుంది.

**'భారతీ భూషణ'**

రూ. 10,000.00 లు గాని, అంతకుమించిన విరాళంగాని అందించే వదాన్యులు 'భారతీభూషణులు.' యువభారతి ప్రచురణలను జీవితకాలమంతా ఉచితంగా వారికి అందిస్తోంది. యువభారతి సభాముఖంగా భారతీభూషణులను సత్కరించి తన కృతజ్ఞతలను తెలుపుకుంటుంది.

'యువభారతి'కి స్నేహహస్తాన్ని అందించండి!
మీ సహాయం సాహితీ సహృదయలోకాన్ని సేవించటంలో
సద్వినియోగం జరిగే అవకాశాన్ని కలిగించండి!
మీరూ యువభారతీయ కుటుంబంలో సభ్యులై
సాహిత్య చైతన్యంలో భాగస్వాములు కండి!
యువభారతి మీకిదే హృదయపూర్వకమైన
ఆహ్వానం అందజేస్తోంది!